శ్రీమతే సుదర్శనాయ నమః

శ్రీకూరనారాయణముని ప్రణీతమైన

# శ్రీసుదర్శనశతకము

**( తాత్పర్యంతో )**

**రంగేశవిజ్ఞప్తికరామయస్య యః చకార చక్రేశనుతిం నివృత్తయే ।**
**సమాశ్రయేఽహం వరపూరణాయ నః తం కూరనారాయణనామకం మునిమ్ ॥**

శ్రీరంగంలోని శ్రీరంగనాథస్వామి ఆలయంలో తిరువరఙ్గప్పెరుమాళ్ అరైయర్ అనే ఆచార్యులకు శరీరంలో కల్గిన వ్యాధి తొలగడంకోసం కూరేశుల శిష్యులు, శ్రీకూరనారాయణముని అనే మహనీయులు శ్రీసుదర్శనస్వామిని స్తుతిస్తూ నూటు శ్లోకాలను కల శ్రీసుదర్శనశతకాన్ని రచించారు. ఈ స్తుతి తనను పఠించేవారికి అన్ని కోరికలను పూర్తిచేస్తుంది. ఇటువంటి స్తుతిని రచించిన శ్రీకూరనారాయణమునిని నేను శరణంగా ఆశ్రయిస్తున్నాను.

## జ్వాలావర్ణనమ్

శ్రీసుదర్శనుని జ్వాల మీ మనోరథాలను తీర్చాలి.

1. **సౌదర్శన్యుజ్జిహానా దిశి విదిశి తిరస్కృత్య సావిత్ర మర్చిః**
**బాహ్యాబాహ్యాంధకారక్షతజగదగదంకారభూమ్నా స్వధామ్నా ।**
**దోఃఖర్జూదూరగర్జద్విబుధరిపువధూకంఠవైకల్యకల్యా**
**జ్వాలా జాజ్వల్యమానా వితరతు భవతాం వీప్సయాఽభీప్సితాని ॥**

శ్రీసుదర్శనశతకంలో గల 100శ్లోకాలలో 24 శ్లోకాలు జ్వాలను, 16 శ్లోకాలు నేమిని, 12 శ్లోకాలు అరాలను (రేకులను), 11 శ్లోకాలు నాభిని, 13 శ్లోకాలు అక్షాన్ని, 26 శ్లోకాలు అందులో వేంచేసి ఉండే సుదర్శనపురుషుని వర్ణిస్తున్నాయి. ముందుగా చేయబడే జ్వాలావర్ణనం. ఈ మొదటి శ్లోకంతో ఆరంభం అవుతున్నది.

లోకంలోని చీకటి రెండు విధాలు. ఒకటి బాహ్యతమస్సు. రెండవది అంతర తమస్సు- అంటే మనస్సులో ఉండే చీకటి. ఈ అంతరతమస్సుకు అజ్ఞానాంధకారమని పేరు. బాహ్యతమస్సు- లోకంలో అంతటా కన్పించే, వ్యాపించే చీకటి. ఈ రెండు విధాలైన చీకట్లతో అలమటించే లోకాన్ని ఆ చీకట్లను లేకుండా చేయడంద్వారా ఉజ్జీవింప చేయగల్గినది శ్రీసుదర్శనుని దివ్యజ్వాల. ఇది సూర్యుని తేజస్సును సైతం వెలవెల పోయేటట్లు చేయగల్గినది. సూర్యుని తేజస్సు కేవలం బాహ్యతమస్సునే తీర్చగల్గినది.

కాని, ఇది బాహ్య-అంతరతమస్సులను రెండిటిని పోగొట్టగల్గినది. యుద్ధకండూతిని కల్గి, మాటిమాటికి గర్జించే రాక్షసుల భుజాల తీటను తీర్చి, వారిని సంహరించి, వారి భార్యల మెడలలోని మాంగల్యాలకు వైకల్యాన్ని, అంటే- లోపాన్ని కల్గించగల్గినది శ్రీసుదర్శనుని జ్వాల. ఇటువంటి ఈ జ్వాల మీ కోరికలను విశేషంగా మాటిమాటికి తీర్చుగాక !

శ్రీసుదర్శనజ్వాల మీకు సంపదను ఇవ్వాలి

2. ప్రత్యుద్యాతం మయూఖైః నభసి దినకృతః ప్రత్తసేవం ప్రభాభిః
భూమౌ సౌమేరవీభిః దివి వరివసితం దీప్తిభి ర్దేవధామ్నామ్ ।
భూయస్యై భూతయే వః స్ఫురతు సకలదిగ్భ్రాంతసాంద్రస్ఫులిఙ్గం
చాక్రం జాగ్రత్ప్రతాపం త్రిభువనవిజయవ్యగ్ర ముగ్రం మహ స్తత్ ॥

భూలోకంలో మేరుపర్వతకాంతులతో సేవింపబడినది, ఆకాశంలో సూర్యుని కిరణాలచే స్వాగతింపబడి ఉపచారం చేయబడినది, (మేరుపర్వతకాంతులను, సూర్యకాంతులను మించినది) దేవలోకంలోని దేవతల గృహాల కాంతులను మించినది, అన్ని దిక్కులలో వ్యాపించిన, దట్టమైన అగ్నికణాలను కల్గినది, ముల్లోకాలను జయించడంలో చాలా తీవ్రంగా ప్రయత్నించేది, శత్రువులకు భయాన్ని కల్గించేది అయిన, ఆ ప్రసిద్ధమైన శ్రీసుదర్శన చక్రజ్వాల మీకు అధికమైన సంపదను ఇవ్వాలి.

శ్రీసుదర్శన జ్వాల మీకు గొప్ప సంతోషాన్ని ఇవ్వాలి.

3. పూర్ణే పూరై స్సుధానాం సుమహతి లసతః సోమబింబాలవాలే
బాహాశాఖావరుద్ధక్షితిగగనదివః చక్రరాజద్రుమస్య ।
జ్యోతిశ్చద్మాప్రవాలః ప్రకటితసుమన స్సంపదుత్తంసలక్ష్మీం
పుష్యన్ ఆశాముఖేషు ప్రదిశతు భవతాం సప్రకర్షం ప్రహర్షమ్ ॥

అమృత ప్రవాహం నిండిన చంద్రబింబం అనే గొప్ప పాదులో వెల్గుతున్నది, తన బాహువులనే విశాలమైన కొమ్మలతో భూమ్యాకాశాలను ఆవరించినది అయిన శ్రీసుదర్శనకల్పద్రుమంయొక్క రాబోయే పుష్పసంపదను ప్రకటించేది (దేవతల సంపదను వ్యక్తం చేసేది), దిక్కులనే స్త్రీల శిరస్సులకు భూషణంగా వెలిగేది (అన్ని దిక్కులలో అందంగా వ్యాపిస్తున్నది), జ్యోతిస్సు అనే రూపంలో ఉన్నది అయిన చిగురు మీకు సంతోషాన్ని అధికంగా ఇవ్వాలి.

శ్రీసుదర్శన జ్వాల మీకు చతుర్విధపురుషార్థాలను ఇవ్వాలి.

4. ఆరాదారాత్ సహస్రాత్ విసరతి విమతక్షేపదక్షాత్ యదక్షాత్
నాభే ర్వ్యాప్యత్సనాభేః నిజవిభవపరిచ్ఛిన్నభూమే శ్చ నేమేః ।



ఆమ్నాయై రేకకంఠైః స్తుతమహిమమహో మాధవీయస్య హేతేః
తద్వోదిక్ష్వేధమానం చతస్రుషు చతురః పుష్యతాత్ పూరుషార్థాన్ ॥

భగవానుని ఆయుధం అయిన శ్రీసుదర్శనంయొక్క గొప్ప తేజస్సు అరాలు, అక్షం, నాభి, నేమి- అనే అవయవాలనుండి వెలువడుతున్నది. ఈ అవయవాల సంఘాతరూపం అయిన సుదర్శనంయొక్క తేజస్సు వేదాలచే ముక్తకంఠంగా కీర్తింపబడింది. నాల్గు దిక్కులలో వ్యాపిస్తున్నది. అటువంటి సుదర్శనుని తేజస్సు మీకు నాల్గు విధాలైన పురుషార్థాలను అనుగ్రహించాలి.

శ్రీసుదర్శనజ్వాల మీ సుఖాన్ని వర్ధిల్లజేయాలి.

5. శ్యామం ధామప్రసృత్యా క్వచన భగవతః క్వాపి బభ్రు ప్రకృత్యా
శుభ్రం శేషస్య భాసా క్వచన మణిరుచా క్వాపి తస్యైవ రక్తమ్ ।
నీలం శ్రీనేత్రకాన్త్యా క్వచిదపి మిథునస్యాదిమస్యేవ చిత్రాం
వ్యాతన్వానం వితానశ్రియ ముపచినుతాత్ శర్మ వ శ్చక్రభానమ్ ॥

నీలమేఘువర్ణుడైన భగవానుని దివ్యదేహకాంతి వ్యాపించడంవల్ల కొన్ని చోట్ల నల్లని వర్ణాన్ని కల్గినది, కొన్నిచోట్ల సహజసిద్ధం అయిన పింగళవర్ణాన్ని కల్గినది, ఆదిశేషుని శరీరకాంతివల్ల కొన్ని చోట్ల తెల్లనిది, ఆశేషుని పడగలపై ప్రకాశించే రత్నాల కాంతి వల్ల కొన్ని చోట్ల ఎఱ్ఱనిది, నల్లకలువలవంటి కన్నులను కల లక్ష్మీదేవి నేత్రాల కాంతివల్ల కొన్ని చోట్ల నల్లనిది - ఈ విధంగా పలు రంగులలో వ్యాపించి ఉండే శ్రీసుదర్శనుని జ్యోతిస్సు దివ్యదంపతులైన లక్ష్మీనారాయణుల విహారం కోసం నిర్మింపబడ్డ, చిత్రవర్ణాన్ని కల్గి ఉండే మేల్‌కట్టువలె భాసిస్తున్నది. ఇటువంటి ఆ జ్యోతిస్సు మీ సుఖాన్ని అభివృద్ధిచేయాలి.

శ్రీసుదర్శన జ్వాల మీ పాపాన్ని పోగొట్టాలి.

6. శంసంత్యున్మేష ముచ్ఛోషితపరమహసో భాస్వతః కైటభారేః
ఇన్ధే సంధ్యేవ నక్తంచరవిలయకరీ యా జగద్వందనీయా ।
బంధూకచ్ఛాయబంధుచ్ఛవిఘటితఘనచ్ఛేదమేదస్వినీ సా
రాథాంగీ రశ్మిభంగీ ప్రణుదతు భవతాం ప్రత్యహోత్థాన మేనః ॥

శ్రీసుదర్శనభగవానుని జ్వాలాప్రకారాలు శ్లేషాలంకారప్రక్రియలో ఇందులో వర్ణింపబడుతున్నాయి. ప్రాతఃసంధ్యతో సుదర్శనుని జ్వాలలకు పోలిక ధ్వనింపజేయడం ఇక్కడి విషయం.

ప్రాతఃసంధ్య మిగిలిన జ్యోతిఃపదార్థాల కాంతిని అంతటిని వెలవెల పోయేటట్లు చేసే సూర్యుని ఉదయాన్ని సూచిస్తుంది. అదే విధంగా శ్రీసుదర్శనుని జ్వాల ప్రత్యర్థుల తేజస్సును కబళీకరించగల శ్రీరంగనాథుని ఉన్మేషాన్ని -అంటే- అఘటితఘటనా సామర్థ్యాన్ని ప్రకాశింపజేస్తుంది. ప్రాతఃసంధ్య నక్తంచరులకు నాశనాన్ని కల్గిస్తుంది. అంటే- రాత్రివేళలో సంచరించే క్రూరజంతువులు అన్నీ ప్రాతఃసంధ్యకాగానే లోపలకు వెళ్ళిపోతాయి. అట్లే, శ్రీసుదర్శనుని జ్వాల రాత్రి సమయంలో సంచారం చేసే రాక్షసులను, అసురులను నాశనం చేస్తుంది. ప్రాతఃసంధ్య లోకానికి అంతటికీ నమస్కరించదగినది అయినట్లే, శ్రీసుదర్శనుని జ్వాలకూడా అందఱికీ నమస్కరించదగినదే. ప్రాతఃసంధ్యాసమయంలో సూర్యుని ఎఱ్ఱని తేజస్సు అంతటా వ్యాపించడంవల్ల అపుడు ఆకాశంలో ఉండే మేఘసమూహం కూడా తన సహజసిద్ధమైన వర్ణాన్ని వీడి ఎఱ్ఱగా మారుతుంది. అందువల్ల అది మంకెనపూలవలె ఎఱ్ఱని కాంతిని కల్గి ఉంటుంది. శ్రీసుదర్శనుని జ్వాలకూడా సహజంగా ఎఱ్ఱనిదేకదా ! ఇటువంటి సుదర్శనుని జ్వాల మీకు ప్రాతఃసంధ్యవలె, ప్రతిదినం కలిగే పాపాన్ని పోగొట్టాలి.

శ్రీసుదర్శన జ్వాల మీకు సతోషాన్ని కల్గించాలి.

7. సామ్యం ధూమ్యాప్రవృద్ధ్యా ప్రకటయతి నభ స్తారకాజాలకాని
స్ఫాలింగీం యాంతి కాంతిం దిశతి యదుదయే మేరు రంగారశంకామ్ ।
అగ్ని ర్మగ్నార్చి రైక్యం భజతి దిననిశావల్లభౌ దుర్లభాభౌ
జ్వాలావర్తా వివ స్తః ప్రహరణపతిజం ధామ వ స్తద్ధినోతు ॥

పలు తేజఃపదార్థాలలో నిండి ప్రకాశించే ఆకాశమండలం శ్రీసుదర్శనుని జ్వాలవల్ల కాంతివిహీనమై, 'ఇది పొగ సముదాయం' అనే స్థితిని పొందింది. నక్షత్రగణాలన్నీ "ఇవి చాలా చాలా చిన్న నిప్పుకణాలు'' అనేటట్లు ఉన్నాయి. మేరుపర్వతం- "ఇది వెలిగే కొఱివికట్టె'' అని తమ తేజస్సు ఎక్కడికి పోయిందో తెలియనట్లుగా కాంతిని కోల్పోయింది. సూర్యచంద్రులు కాంతిని కోల్పోయి చిన్నపిల్లలు ఆడుకొనే పూలపొట్లంవలె (ఒకవిధమైన బాణసంచా) తోచారు. ఇటువంటి శ్రీసుదర్శనుని తేజస్సు మిమ్ములను సంతోషపెట్టాలి.

శ్రీసుదర్శన జ్వాల మీకు శత్రువినాశనాన్ని కల్గించాలి.

8. దృష్ట్వేఽధ్వోమ చక్రే వికచనవజపాసన్నికాశే సకాశం
స్వర్భాను ర్భాను రేష స్ఫుట మితి కలయ న్నాగతో వేగతోఽస్య ।
నిష్టప్తో యైః నివృత్తో విధు మివ సహసా స్రష్టు మద్యాపి నేష్టే
ఘర్మాంశుం తే ఘటంతా మహితవిహతయే భానవో భాస్వరా వః ॥



చంద్రగ్రహణం, సూర్యగ్రహణం సంభవించినపుడు చంద్రుని రాహువు సూర్యునికంటే వేగంగా మింగుతాడు. సూర్యుణ్ణి ఆలస్యంగా మింగుతాడు. దీనికొక కారణాన్ని కవి ఈ శ్లోకంలో ఉత్ప్రేక్షిస్తున్నారు.

అపుడే విడిచిన జపా(మంకెన) పుష్పంవలె ప్రకాశించే శ్రీసుదర్శనుని ఒకసారి చూచిన రాహువు "ఇతడు సూర్యుడు, ఇతనిని మింగుతాను'' అని భావించి, సుదర్శనుని దగ్గరకు వచ్చాడు. అపుడు సుదర్శనుని కిరణాలవల్ల చాలా తాపాన్ని పొందిన రాహువు వెనుకకు వెళ్ళిపోవడమేకాక, నిజంగా సూర్యుడు కన్పించినా అతని దగ్గరకు పోవడానికి ఈనాటికీ సాహసించడంలేదు. "ఇతడు నిజంగా సూర్యుడే- అనే నిర్ధారణ కల్గిన తర్వాతనే ఇతనిని మింగుతాను'' అని భావించి, చంద్రుని మింగినంత వేగంగా సూర్యుణ్ణి మింగడంలేదు. ఈ విధంగా సూర్యప్రతాపాన్ని మించిన ప్రతాపాన్ని కల శ్రీసుదర్శనుని కిరణాలు మీ శత్రువులను నిర్జించాలి.

శ్రీసుదర్శన జ్వాల మీకు ప్రీతిని కల్గించాలి.

9. దేవం హేమాద్రితుంగం పృథుభుజశిఖరం బిభ్రతీం మధ్యదేశే
నాభిద్వీపాభిరామం అరవిపినవతీం శేషశీర్షాసనస్థామ్ ।
నేమిం పర్యాయభూమిం దినకరకిరణాదృష్టసీమః పరీత్య
ప్రీత్యై వ శ్చక్రవాలాచల ఇవ విలస న్నస్తు దివ్యాస్త్రరశ్మిః ॥

శ్రీసుదర్శనుని నేమిచుట్టూ వెలిగే జ్వాలలను చూస్తే భూమిని చుట్టి ఉండే లోకాలోకపర్వతంవలె ఉన్నది. భూమి పెద్ద పెద్ద శిఖరాలను కల మేరుపర్వతాన్ని తనలో కల్గి ఉన్నది. ద్వీపాలు, అరణ్యాలు మొదలైనవానిని కల్గి, ఆదిశేషుని తలపై ఉన్నది. అదేవిధంగా శ్రీసుదర్శనుని నేమికూడా తన నడుమలో శ్రీసుదర్శనపురుషుడనే మేరుపర్వతాన్ని కల్గినది. ఆ పురుషుని బలిష్ఠాలైన బాహువులే ఆ పర్వతశిఖరాలు. అతని నాభి దీవులు. అరాలే అరణ్యాలు. భూమిని చుట్టి ఉండే లోకాలోకపర్వతంలో ఒకవైపు సూర్యకిరణాల ప్రసరణం ఉండదు. చీకటిగా ఉంటుంది. ఇటువంటి లోకాలోకపర్వతంవలె ఉండే సుదర్శనుని జ్యోతి మీకు సదా సంతోషాన్ని కల్గించాలి.

సుదర్శనజ్వాల మీ అన్ని దుఃఖాలను తీర్చాలి

10. ఏకం లోకస్య చక్షుః ద్వివిధ మపనుదత్ కర్మ నమ్రత్రినేత్రం
దాత్రర్థానాం చతుర్ణాం గమయ దరిగణం పంచతాం షడ్గుణాఢ్యమ్ ।
సప్తార్చి శ్శోషితాష్టాపదనవకిరణశ్రేణి రజ్యద్దశాశం
పర్యస్యా ద్వ శ్శతాంగావయవపరిబృఢజ్యోతి రీతీ స్సహస్రమ్ ॥

లోకాలకు నేత్రం వంటిది, పుణ్యపాపాలనే కర్మలను రెండిటినీ నశింపజేసేది, త్రిణేత్రుడైన శివునిచే నమస్కరింపబడేది, ధర్మార్థకామమోక్షాలను అనుగ్రహించేది, శత్రువుల సమూహాన్ని నశింపజేసేది, జ్ఞానం, శక్తి మొదలైన ఆఱుగుణాలను నిండుగా కల్గినది, అగ్నిలో దహింపబడ్డ మేలిమి బంగారంవలె ఎఱ్ఱగా మెఱిసే కిరణాలలో పది దిశలలో వ్యాపించినది అయిన శ్రీసుదర్శనుని తేజస్సు మీకు రక్షణను కల్గించాలి.

ఈ శ్లోకంలో ఒకటినుండి వేయివరకు గల అంకెలను తెలిపే పదాల ప్రయోగం రమణీయం.

శ్రీసుదర్శన తేజస్సు మిమ్మలను కాపాడాలి.

11. ఉచ్చండే యచ్ఛిఖండే నిబిడయతి నభఃక్రోడ మర్కోఽటతి ద్యామ్
అభ్యస్య ప్రౌఢతాపగ్లపితవపు రపో బిభ్రతీ రభ్రపంక్తీః ।
ధత్తే శుష్యత్సుధోత్సో విధు రపమధునః క్షౌద్రకోశస్య సామ్యం
రక్ష న్వ్యస్త్రప్రభో స్తే రచితసుచరితవ్యుష్టయో ఘృష్టయో వః ॥

శ్రీసుదర్శనుని కిరణాలయొక్క జ్వలించే కాంతి ఆకాశాన్ని తాకగానే, దానివల్ల మిక్కిలిగా తపింపబడ్డ సూర్యుడు వర్షించే మేఘాల చాటున దాగి ఉండి, సంచరిస్తున్నాడు. తనలోని అమృతప్రవాహం ఎండిపోవడంవల్ల తేనె లేని తేనెపట్టువలె చంద్రుడు కన్పిస్తున్నాడు. ఇటువంటి, అధికాధికంగా పుణ్యాన్ని వృద్ధిచేసే సుదర్శనుని కిరణాలు మిమ్మలను రక్షించి, కరుణించాలి.

శ్రీసుదర్శన జ్వాల మీకు గొప్ప ఆనందాన్ని ఇవ్వాలి.

12. పద్మౌఘో దీర్ఘికాంభస్యవనిధరతటే గైరికాంబుప్రపాతః
సిందూరం కుంజరాణాం దిశిదిశి గగనే సాంధ్యమేఘప్రబంధః ।
పారావారే ప్రవాలో వనభువి చ తథా ప్రేక్ష్యమాణః ప్రముగ్ధైః
సాధిష్ఠం వః ప్రమోదం జనయతు దనుజద్వేషిణ స్త్విషరాశిః ॥

దిగుడుబావులలో పూచిన ఎఱ్ఱతామరల గుంపు అని, పర్వత చరియలలో పాఱే ధాతురాగం కలిసిన ప్రవాహ జలం అని, ఒక్కొక్క దిక్కులో ఉండే దిగ్గజాలకు అలంకరించిన సిందూరచూర్ణం అని, ఆకాశంలో సంధ్యాకాలసమయంలో కన్పించే ఎఱ్ఱని మేఘాలగుంపు అని, సముద్రంలోని పగడాలవలె, అరణ్యంలోని లేతచిగుళ్ళు అని పామరజనంచేత భావింపబడే శ్రీసుదర్శనుని కిరణసమూహం మీకు గొప్ప ఆనందాన్ని ఇవ్వాలి.



శ్రీసుదర్శనజ్వాల మీ సంసారమనే వ్యాధిని తీర్చాలి.

13. భానో భానో త్వదీయా స్ఫురతి కుముదినీమిత్ర తే కుత్ర తేజః
తారా స్తారా దధీరోఽ స్యనల న భవతః స్త్వైర మైరమ్మదార్చిః ।
శంసంతీత్థం నభస్థా యదుదయసమయే చక్రరాజాంశవ స్తే
యుష్మాకం ప్రౌఢతాపప్రభవభవగదాపక్రమాయ క్రమంతామ్ ॥

శ్రీ సుదర్శనుని కిరణాలు ఉదయించే సమయంలో ఆకాశంలో దివ్యవిమానాలలో సంచరించే గంధర్వులు, కిన్నరులు మొదలైనదేవతలు- "ఓ సూర్యుడా ! నీ తేజస్సు ఏమయింది? ఓ చంద్రుడా! నీకాంతి ఎక్కడకు పోయింది ? ఓ తారకలారా ! మీరు దూరంగా పొండి. అగ్నీ ! నీవు ఈ విధంగా వెల వెల పోతున్నావే ! ఓ వజ్రాగ్ని తేజమా ! నీవు సుదర్శనుని కాంతితో కలసి రూపు పోగొట్టుకొని, ప్రత్యేకతను కోల్పోయావే !" అని సూర్యుడు మొదలైనవారిని ఉద్దేశించి పలికే గొప్పతనాన్ని కల శ్రీసుదర్శనకిరణాలు మీ తాపత్రయానికి మూలకారణం అయిన జన్మను లేకుండా చేస్తాయి.

శ్రీసుదర్శన జ్వాల మీకు నిరంతరమైన వృద్ధిని ఇవ్వాలి.

14. జగ్ధ్వా కర్ణేషు దూర్వాంకుర మరిసుదృశా మక్షిషు స్వర్వధూనాం
పీత్వా చాంభ శ్చరంత్యః సవృష మనుగతా వల్లవేనాదిమేన ।
గావో వ శ్చక్రభర్తుః పర మమృతరసం ప్రశ్రితానాం దుహానాః
ఋద్ధిం స్వాలోకలుప్తత్రిభువనతమస స్సానుబంధాం దదంతామ్ ॥

శత్రుస్త్రీలు తమ చెవులలో మంగళార్థం అలంకరించుకొన్న గరికపోచల మొలకలను భక్షించి (రాక్షస వీరులను సంహరించడంద్వారా వారి భార్యలను విధవలనుగా చేసి), దేవకాంతల నేత్రాలలోని బాష్పాన్ని తాగి (దేవకాంతల దుఖాన్ని తీర్చి) సంచరించే సుదర్శనుని కిరణాలు గోవులవలే ఉన్నాయి. గోవులు వృషమనే శబ్దంతో చెప్పబడే ఆబోతులతో కలసి సంచరించేటట్లే సుదర్శనుని కిరణాలు కూడా వృషశబ్దంచేత చెప్పబడే ధర్మాన్ని అతిక్రమించకుండా ప్రవర్తిస్తాయి. గోవులను శ్రీకృష్ణుడు అనుసరించి వెళ్ళేటట్లే సుదర్శనుని కిరణాలుకూడా భగవానునితోపాటు ఉంటాయి. గోవులు అమృతంవంటి పాలను ఇచ్చేటట్లే సుదర్శనుని కిరణాలుకూడా అమృతశబ్దంచేత చెప్పబడే మోక్షంలో రుచిని కలిగిస్తాయి. ముల్లోకాలలోని అజ్ఞానాన్ని పోగొట్టే భగవానునియొక్క ఆయుధమైన సుదర్శనునియొక్క కిరణాలు మీకు నిరంతరమైన సంపదను ఇవ్వాలి.

శ్రీసుదర్శన జ్వాల మీ జన్మజన్మల పాపాలను పోగొట్టాలి

15. సేనాం సేనాం మఘోనో మహతి రణముఖేఽ లంభయం లంభయంతీః
ఉత్సేకోష్ణాలుదోష్ణాం ప్రథమదివిషదా మావలీ ర్యాఽ వలీఢే ।

విశ్వం విశ్వంభరాద్యం రథపదధిపతే ర్లీలయా పాలయన్తీ
వృద్ధి స్సా దీధితీనాం వృజిన మనుజను ర్మార్జయత్వార్జితం వః ॥

గొప్ప యుద్ధరంగంలో నాయకులతో కూడిన ఇంద్రుని సైన్యానికి చాలా భయాన్ని కల్గిస్తూ, గర్వంతో విఱ్ఱవీగుతూ సదా యుద్ధాన్ని చేయాలనే భుజాల తీటను కల, బలిష్ఠాలైన బాహువులను కల్గిన అసురుల సమూహాలను నాశనం చేసి, భూమ్యాది సమస్తవిశ్వాన్ని అవలీలగా రక్షించే శ్రీసుదర్శనుని కిరణాలు మీరు ఎన్నో జన్మలనుండి పేర్చి పెట్టుకొన్న పాపాలను పోగొడతాయి.

శ్రీసుదర్శనజ్వాల మీకు మనోరథసిద్ధిని కల్గించాలి.

16. తప్తా స్వేనోష్మణేవ ప్రతిభటవపుషా మస్త్రధారా ధయన్తీ
ప్రాప్తేవ క్షీబభావం ప్రతిదిశ మసకృత్ తన్వతీ ఘూర్ణితాని ।
వంశాస్థిస్ఫోటశబ్దం ప్రకటయతి పటూ న్యా వహన్త్యట్టహాసాన్
భా స్సా వః స్యన్దనాంగప్రభుసముదయినీ స్పన్దతాం చిన్తితాయ ॥

సుదర్శనుని ప్రకాశం తన వేడిమితో చాలా దాహాన్ని పొందినదానివలె శత్రువుల శరీరాలనుండి కారే రక్తధారలను తాగి, దానివల్ల చాలా మదాన్ని పొందుతూ, అన్ని దిక్కులలో సంచరిస్తున్నది. శత్రువుల శరీరాలలో వెనుక వైపున ఉండే ఎముకలను అది విఱిచేటపుడు ఆ ఎముకలనుండి పటపటమనే పెద్దశబ్దం వస్తున్నది. దానిని చూచి సుదర్శనుని ప్రకాశం అట్టహాసం చేస్తున్నది. (మఱింతగా ప్రజ్వలిస్తున్నది.) అటువంటి సుదర్శనప్రభువుప్రకాశం మీరు కోరిన కోరికల సిద్ధికోసం ప్రయత్నించాలి.

శ్రీసుదర్శన జ్వాల మీ పాపాలనే దావాగ్నిని ఆర్పివేయాలి.

17. దేవై రాసేవ్యమానో దనుజభటభుజాదణ్డదర్పోష్మతప్తైః
ఆశారోధో౽తిలంఘీ లుఠదుడుపటలీలక్ష్యడిండీరపిణ్డః ।
రింగ జ్జ్వాలాతరంగత్రుటితరిపుతరువ్రాతపాతోగ్రమార్గః
చాక్రో వ శ్శోచిరోఘ శ్శమయతు దురితాపహ్నవం దావవహ్నిమ్ ॥

శ్రీసుదర్శనుని జ్వాల జలప్రవాహంవంటిది. సూర్యుని వేడిమితో తపింప బడేవారు జలప్రవాహంలో మునిగి స్నానం చేసి, తమ తాపాన్ని పోగొట్టుకొంటారు. అదేవిధంగా, అసురుల భుజాల మదంచేత తపింపబడే దేవతలు శ్రీసుదర్శనుని జ్వాలా ప్రవాహంలో మునిగి, తమ తాపాన్ని తీర్చుకొంటున్నారు. వేగంగా ప్రవహించే జలప్రవాహం నుఱుగును ఎక్కువగా వెలువరిస్తుంది. తీరాన్ని తాకుతూ ప్రవహిస్తుంది. తీరాలలో భయంకరంగా ఉంటుంది. అదే రీతిలో సుదర్శనుని జ్వాలాప్రవాహం శత్రుశరీరాలను ఖండించి, వాటిని కొట్టుకొని ముందుకు సాగుతూ భయాన్ని కల్గిస్తున్నది. ఇటువంటి సుదర్శనజ్వాలాప్రవాహం మీ పాపం అనే దావాగ్ని చల్లార్చాలి.



శ్రీసుదర్శన జ్వాల మీకు గొప్ప మంగళాన్ని కల్గించాలి.

18. భ్రామ్యంతీ సంశ్రితానాం భ్రమశమనకరీ ఛ్చన్నసూర్యప్రకాశా
సూర్యాలోకానురూపా రిపుహృదయతమస్కారిణీ నిస్తమస్కా ।
ధారాసంపాతినీ చ ప్రకటితదహనా దీప్తి రస్త్రేశితు ర్వః
చిత్రా భద్రాయ విద్రావితవిమతజనా జాయతా మాతతాయ ॥

(తనలో బుద్ధిభ్రమ ఏమాత్రం లేనిది కనుక) తన పరిభ్రమణాలతో ఆశ్రితుల మనస్సులలో ఉండే భ్రమాత్మకజ్ఞానాన్ని పోగొట్టేది, సూర్యుని ప్రకాశాన్ని (భారతయుద్ధసమయంలో) మఱుగు పఱచేది అయినా, పండితుల జ్ఞానాన్ని అభివృద్ధి చేసేది, తనలో తమస్సు (చీకటి, అజ్ఞానం) ఏమీ లేకున్నా, శత్రువుల గుండెల్లో చీకట్లను-అంటే- భయం అనే అజ్ఞానాన్ని కల్గించేది, ధారాసంపాతిని అయినా (తన అంచులలో వ్యాపించేది అయినా) శత్రువుల మీద గొప్ప అగ్నిని వర్షించేది- ఈవిధంగా పరస్పరవిరుద్ధస్వభావాన్ని కల్గి ఉండే శ్రీసుదర్శనుని జ్వాల మీకు గొప్ప మంగళాలను కల్గించాలి.

శ్రీ సుదర్శనజ్వాల మీకు ఉన్నతమైన శుభాన్ని ఇవ్వాలి.

19. నిన్యే వన్యేవ కాశీ దవశిఖిజటిలజ్యోతిషా యేన దాహం
కృత్యా వృత్యా విలిల్యే శలభసులభయా యత్ర చిత్రప్రభావే ।
రుద్రో౽ ప్యద్రే ర్దుహిత్రా సహ గహనగుహాం యద్భయా దభ్యయాసీత్
దిశ్యాత్ విశ్వార్చితో వ స్సశుభ మనిభృతం శౌరిహేతిప్రతాపః ॥

పూర్వం ఒకానొక సమయంలో (శ్రీకృష్ణావతారసందర్భంలో) సుదర్శనుని జ్యోతిస్సు కాశీనగరాన్ని కాల్చివేసింది. అపుడు దుర్వాసోముని సృష్టించిన, ఆసురమైన కృత్య సుదర్శనుని తేజస్సులో మిడుతవలె పడి మాడి మసి అయింది. ఇంకొక సమయంలో సుదర్శనుని తేజస్సును చూచి భయపడి పరమశివుడు పార్వతితోపాటు పాఱిపోయి కొండగుహలలో ఎక్కడో లోపల దాగి ప్రాణాలను దక్కించుకొన్నాడు. ఇటువంటి ప్రభావాన్ని కల సుదర్శనుని తేజస్సు మీకు శాశ్వతమైన మంగళాన్ని కల్గించాలి.

శ్రీసుదర్శనుని జ్వాల మీకు దిగంత విశ్రాంతకీర్తిని ఇవ్వాలి.

20. ఉద్యన్బింబా దుదారాత్ నయనజలహిమం మార్జయన్ నిర్జరీణామ్
అజ్ఞానధ్వాంతమూర్ఛాకరజనిరజనీభంజనవ్యంజితాధ్వా ।
న్యక్కుర్వాణో గ్రహాణాం స్ఫురణ మపహర న్నర్చిషః పావకీయాః
చక్రేశార్కప్రకాశో దిశతు దశ దిశో వ్యశ్నువానం యశో వః ॥

సుదర్శనుడనే సూర్యునియొక్క ప్రకాశం ఆ సుదర్శన బింబంనుండి ఉద్భవిస్తున్నది. లోకంలోని సూర్యుడు మంచును ఆవిరిచేసేటట్లే అది దేవతాకాంతల కన్నీరు అనే మంచును హరిస్తున్నది. లోకంలోని సూర్యుడు తమస్విని అయిన రాత్రిని లేకుండా చేసి, సదసద్వివేకాన్ని కల్గించి, సన్మార్గాన్ని చూపిస్తాడు. అదేవిధంగా సుదర్శనుడనే సూర్యుడుకూడా సంసారమనే కాళరాత్రిని అంతం చేసి, మంచి చెడ్డల వివేకాన్ని కల్గించి రక్షిస్తున్నాడు. సూర్యుడు మిగిలిన గ్రహాల ప్రకాశానికి మించిన ప్రకాశాన్ని కలవాడు. ఈ సుదర్శన సూర్యుడు. అగ్ని కాంతులను మించిన కాంతులను కలవాడు. అటువంటి ఈ సుదర్శన సూర్యుడు మీకు వివేకాన్ని కల్గించి, సన్మార్గాన్ని చూపి, పది దిక్కులలో వ్యాపించిన గొప్ప యశస్సును ఇవ్వాలి.

శ్రీసుదర్శనజ్వాల మీ అజ్ఞానాన్ని పోగొట్టాలి.

21. వర్గస్య స్వర్గధామ్నా మపి దనుజనుషాం విగ్రహం నిగ్రహీతుం
దాతుం సద్యోబలానాం శ్రియ మతిశయినీం పత్రభంగానువృత్త్యా ।
యోక్తుం దేదీప్యతే యా యుగపదపి పురో భూతిమయ్యా ప్రకృత్యా
సా వో సుద్యా దవిద్యాం ద్యుతిరమృతరసస్యందినీ స్యాందనాంగీ ॥

మోక్షమనే అమృతరసాన్ని ప్రవహింపజేసే సుదర్శనుని కాంతి ఒకే సమయంలో దేవతలకు అసురులతోగల విరోధాన్ని ఆ అసురులను నశింపజేయడంద్వారా పోగొడుతున్నది, అసురుల శరీరాలను నశింపజేస్తున్నది. ఒకేసమయంలో దేవతాస్త్రీల, మకరికాపత్రరచనలతో శోభను కల్గించడంద్వారా వారి సంపదను వృద్ధిచేస్తున్నది; అసురసైన్యాల సంపదను వారి గజతురగాది వాహనాలను వధించడం ద్వారా లేకుండా చేస్తున్నది. ఒకేసమయంలో దేవతల నగరాలకు అధికాధికమైన సంపదను కల్గిస్తున్నది; అసురవర్గాల పట్టణాలను భస్మీపటలం చేస్తున్నది. అటువంటి సుదర్శనుని జ్యోతిస్సు మీ అజ్ఞానాన్ని పోగొట్టాలి.

శ్రీసుదర్శనుని కిరణం మీకు సద్యఃఫలాన్ని ఇవ్వాలి.

22. దాహం దాహం సపత్నాన్ సమరభువి లసద్భస్మనా వర్త్మనా యాన్
క్రవ్యాదప్రేతభూతాద్యభిలషితవపుషా ప్రీతకాపాలికేన ।
కంకాలైః కాలధౌతం గిరి మివ కురుతే యః స్వకీర్తే ర్విహర్తుం
ఘుష్టి స్సాంధృష్టికం వ స్సకల ముపనయత్వాయుధాగ్రేసరస్య ॥

శ్రీసుదర్శనుని కిరణాలు యుద్ధరంగంలో శత్రువుల (అసురులను, రాక్షసులను) బూడిద చేసి, ప్రేతాల, భూతాలకు తృప్తిని కల్గిస్తాయి. ఆ విధంగా నశింపజేయబడ్డ వారి శరీరాలలోని ఎముకల సమూహాలు పర్వతాలవలె పేరుకొని ఉండడంవల్ల అవి తన ప్రేయసి అయిన కీర్తికాంత వినోదార్థం సుదర్శనపురుషుడు ఒక తెల్లని పర్వతాన్ని నిర్మించినట్లున్నవి. అటువంటి సుదర్శనుని కిరణాలు మీకు అన్ని విధాలైన ఫలాలను ఇవ్వాలి.



శ్రీసుదర్శనుని తేజస్సు మీ ప్రారబ్ధాన్ని శమింపజేయాలి.

23. దగ్ధానాం దానవానాం సభసితనిచయై రస్థిభి స్సర్వశుభ్రాం
పృథ్వీం కృత్వాఽపి భూయో నవరుధిరఝరీకౌతుకం కౌణపేభ్యః ।
కుర్వాణం బాష్పపూరైః కుచతటఘుసృణక్షాళనైః తద్వధూనాం
పాపం పాపచ్యమానం శమయతు భవతా మస్త్రరాజస్య తేజః ॥

శ్రీసుదర్శనుని తేజస్సుచేత అసురులు దహింపబడినపుడు వారి శరీరాలలోని మాంసం పూర్తిగా భక్షింపబడడంవల్ల, యుద్ధరంగంలో అంతటా వారి ఎముకల బూడిద మాత్రమే వ్యాపించి ఉన్నది. అపుడు యుద్ధరంగంలో సంచరించే భూతప్రేతాదులు "ఇక మాకు భుజించడానికి ఏమున్నది?" అనే నిరుత్సాహాన్ని పొందారు. అసురుల స్త్రీలు తమ భర్తలు మరణించడంవల్ల రోదించినపుడు వారి కన్నీటి ప్రవాహం వారి గుండెల మీదుగా స్రవించింది. వారి వక్షఃస్థలంలో మంగళార్థం పూసికొన్న కుంకుమతో ఆ కన్నీటి ప్రవాహం కలిసి, ఎఱ్ఱని నూతనరక్తప్రవాహంగా తోచింది. దానిని చూచి భూత ప్రేతాదులు "మనకు తాగడానికి నూతనమైన రక్తం లభించింది. ఇక దీనిని ఆస్వాదిద్దాం" అనే ఆశను పొందారు. అటువంటి సుదర్శనుని ద్యుతి మీ పాపాన్ని పోగొట్టాలి.

శ్రీసుదర్శనుని జ్యోతిస్సు మీ వందలాది పాపాలను పోగొట్టాలి.

24. మా గా న్మోషం లలాటానల ఇతి మదనద్వేషిణా ధ్యాయతేవ
స్రష్టా ప్రోన్నిద్రవాసామ్బుజదలపటలప్లోష ముత్ప్రశ్యతేవ ।
వజ్రాగ్ని ర్మా స్మ నాశం వ్రజదితి చకితేనేవ శక్రేణ బద్ధైః
స్తోత్రై రస్త్రేశ్వరస్య ద్యతు దురితశతం ద్యోతమానా ద్యుతిర్వః ॥

సుదర్శనుని తేజస్సువల్ల తన ఫాలభాగంలో ఉండే అగ్ని నాశనాన్ని పొందకూడదని సదా ధ్యానం చేసే శివుడు, తన నివాసం అయిన తామరపూవు రేకులు మాడిపోకూడదని బ్రహ్మ, తన ఆయుధం అయిన వజ్రంయొక్క అగ్ని నాశనం కాకూడదని భయపడే ఇంద్రుడు ఎల్లప్పుడు ఆ శ్రీసుదర్శనుని తేజస్సును స్తుతిస్తున్నారు. అటువంటి సుదర్శనుని తేజస్సు మీ వందలాది పాపాలను పోగొట్టాలి.

## నేమివర్ణనమ్

శ్రీసుదర్శననేమి మీకు గొప్పసంపదను ఇవ్వాలి.

25. శస్త్రాస్త్రం శాత్రవాణాం శలభకుల మివ జ్వాలయా లేలిహానా
ఘోషైః స్వైః క్షోభయంతీ విఘటితభగవద్యోగనిద్రాన్ సముద్రాన్ ।

వ్యూఢోరఃప్రౌఢచారత్రుటితపటురటత్కీకసక్షుణ్ణదైత్యా
నేమి స్సౌదర్శనీ వః శ్రియ మతిశయినీం దాశతా దాశతాబ్దమ్ ॥

నేమి అంటే చక్రం అంతర్భాగాన్ని గుండ్రంగా చుట్టూ ఆవరించి ఉండే అంచు అనే భాగం. ఒక వ్యక్తి శరీరంలోని ఒక అంగాన్ని వర్ణిస్తే, ఆ స్తుతి ఆ వ్యక్తికి చెందేటట్లే, ఇక్కడ సుదర్శనుని నేమిని వర్ణించడం సుదర్శనస్తుతిలోనే పర్యవసిస్తుంది. ఈ నేమి వర్ణనం **25**వ శ్లోకంనుండి వరుసగా **14** శ్లోకాలలో- అంటే **38** శ్లోకంవరకు సాగుతున్నది.

అసురుల, రాక్షసుల శస్త్రాలను, అస్త్రాలను మిడుతలగా మాడ్చి మసిచేసే జ్వాలను సుదర్శనుని నేమి చుట్టూ కల్గి ఉన్నది. తన హోరుతో భగవానుని యోగనిద్రను చెదరగొట్టే సముద్రాలను కుతకుతలాడిస్తున్నది. అసురుల వక్షఃస్థలాలలో చాలా సమర్థవంతంగా, కఠినంగా ప్రవర్తించడం ద్వారా, వారి ఎముకలను చూర్ణం చేస్తున్నది. ఇటువంటి సుదర్శనుని నేమి మీకు చిరకాలం గొప్ప సంపదను అనుగ్రహించాలి.

శ్రీసుదర్శననేమి మీ ఆత్మకు అనుగుణం అయిన మార్గాన్ని చూపాలి.

**26.** ధారా చక్రస్య తారాగణకణవితతిద్యోతితద్యుప్రచారా
పారావారాంబుపూరక్వథనపిశునితోత్తాలపాతాలయాత్రా ।
గోత్రాద్రిస్ఫోటశబ్దప్రకటితవసుధామండలీచండయానా
పంథానం వః ప్రదిశ్యాత్ ప్రశమనకుశలా పాప్మనా మాత్మనీనమ్ ॥

శ్రీసుదర్శనచక్రధార (అంచు) యొక్క ప్రకాశం ముల్లోకాలలో అడ్డు లేకుండా వ్యాపించే తీరు ఇందులో అందంగా కీర్తింపబడుతున్నది.

సుదర్శనుని నేమినుండి పుట్టే నిప్పుకణాలు నక్షత్రాల సమూహంవలె ఉన్నవి. ఈ నేమి ఆకాశంలో అడ్డు లేని సంచారాలను కల్గి ఉన్నది. సముద్రంలోని నీటి ప్రవాహాలను సలసలమని కాగేటట్లు చేస్తూ, పాతాళలోకంవరకు అడ్డు లేని తన సంచారాలను సూచిస్తున్నది. సప్తకులపర్వతాలను విస్ఫోటనం చేస్తూ, భూమండలంలో ఎక్కడా అడ్డులేని సంచారాలను కల్గి ఉన్నది. జగత్తులోని జనుల పాపసమూహాలను ఉపశమింపజేయడంలో సమర్థమైనది. ఇటువంటి సుదర్శనుని నేమి మీ ఆత్మకు అనుగుణం అయిన మార్గాన్ని అనుగ్రహించాలి.

శ్రీసుదర్శన నేమి మీకు సుఖాన్ని ఇవ్వాలి.

**27.** యాత్రా యా త్రాతలోకా ప్రకటితవరుణత్రాసముద్రే సముద్రే
సత్త్వా సత్త్వాసహోష్మా కృతసగరుదగస్పందదానా దదానా ।
హానిం హా నిందితానాం జగతి పరిషదాం దానవీనాం నవీనాం
చక్రే చక్రేశనేమి శ్శ ముపహరతాత్ సప్రభావప్రభా వః ॥



పూర్వం పర్వతాలకు రెక్కలు ఉండేవి. అవి ఆ రెక్కలతో యథేష్టంగా సంచరిస్తూ లోకాలకు ఉపద్రవాన్ని కల్గించేవి. ఇంద్రుడపుడు వాటి రెక్కలను వజ్రాయుధంతో ఖండించాడని పౌరాణికగాథ. వజ్రాయుధం పర్వతాల రెక్కలను ఖండించడంలో సుదర్శనుని శక్తి తోడ్పడిందనే భావనతో కవి ఈ శ్లోకంలో ఆ వృత్తాంతాన్ని పేర్కొన్నారు.

శ్రీసుదర్శననేమి లోకాలను అన్నిటినీ పర్వతాల బారినుండి రక్షిస్తున్నది. శ్రీసుదర్శనం సముద్రమార్గంద్వారా ప్రయాణం చేయబోతున్నదని తెలిసిన సముద్రప్రభువైన వరుణుడు “నాకేమి ఆపద కల్గుతుందో ! ఏమో !” అని భయపడ్డాడు. అపుడు సముద్రంలోని చేతనాచేతనాలకు శ్రీసుదర్శనుని నేమిజ్వాల యొక్క వేడిమి భరించరానిది అయింది. రెక్కలతో కూడిన పర్వతాల సంచారాలను సుదర్శనుని నేమి ఖండించింది. నిందితాచారులైన అసురుల గుంపులకు అది నాశనాన్ని కల్గించింది. ఇటువంటి మహిమను కల చక్రనేమి మీకు సుఖాన్ని కల్గించాలి.

శ్రీసుదర్శననేమి మీ పాపాలను నశింపజేయాలి.

**28.** యత్రామిత్రాన్ దిధక్షౌ ప్రవిశతి బలినో దామ నిస్సీమధామ్ని
గ్రస్తాపస్తాపశీర్ణైః ప్రగుణితసికతో మౌక్తికై శ్శౌక్తికేయైః ।
రాశి ర్వారా మపారాం ప్రకటయతి పున ర్వైరిదారాశ్రుపూరైః
వృద్ధిం నిర్యాతి నిర్యాపయతు స దురితా న్యస్త్రరాజప్రధి ర్వః ॥

శ్రీసుదర్శన భగవానుడు సముద్రమార్గం ద్వారా పాతాళలోకంలో ప్రవేశించి, అక్కడ ఉండే రాక్షసులను నిర్మూలించి తిరిగి వచ్చిన రీతి ఇందులో చమత్కార పూర్వకంగా తెలుపబడుతున్నది.

శత్రువులను, అందఱినీ సమూలంగా, నిశ్శేషంగా దహించాలనే ఉద్దేశ్యంతో శ్రీసుదర్శనుని నేమి సముద్రమార్గంలో పాతాళలోకంలో ప్రవేశించేటపుడు, ఆ నేమి తాపానికి సముద్రంలోని నీరు, అంతా ఆవిరి అయింది. అపరిమితమైన తాపం కల్గింది. సముద్రంలోని నీరు అంతా ఆవిరి అయిపోగా, సముద్రంలో ఉండే ముత్యపు చిప్పలనుండి సుదర్శనుని నేమియొక్క వేడిమివల్ల చెదఱిన ముత్యాలు అంతటా పడి, చూర్ణమై, సముద్రపు ఇసుకను మఱింతగా పెంచుతున్నవి. ఇక, సుదర్శనుడు తిరిగివచ్చే సమయానికి, మరణించిన అసురులయొక్క భార్యలు భర్తృవియోగంవల్ల కన్నీరు మున్నీరుగా విలపించడంవల్ల, వారి కన్నీటి ప్రవాహం వాగులై సముద్రంలోనికి ప్రవహించి దానిని నిండించింది. అందువల్ల ముందుకంటే మఱింత అధికంగా జలసమృద్ధిని కల్గినదిగా సముద్రం అయినది. అటువంటి శ్రీసుదర్శనుని నేమి మీ పాపాలను నిశ్శేషంగా నశింపజేయాలి.

శ్రీసుదర్శననేమి మీపాపాల ప్రభావాన్ని దహించాలి.

29. కక్ష్యా తౌల్యేన కద్రూతనయఫణమణీన్ కల్యదీపస్య యుంజన్
పాతాలాంతఃప్రపాతీ నిఖిల మపి తమ స్స్వేన ధామ్నా నిగీర్య ।
దైతేయప్రేయసీనాం వమతి హృది హృతప్రేయసాం భూయసా యః
చక్రాగ్రీయాగ్రదేశో దహతు విలసితం భూయసా మంహసాం వః ॥

శ్రీ సుదర్శనుని నేమియొక్క పాతాళలోక సంచారమే మళ్ళీ ఈ శ్లోకంలో అందంగా వర్ణింపబడుతున్నది.

సుదర్శన నేమి పాతాళలోకంలో ప్రవేశించి, కద్రువకుమారులైన సర్పాల పడగలలోని రత్నాలను పగటి దీపాలవలె వెలవెలపోయేటట్లు చేస్తున్నది. తన తేజస్సుతో పాతాళంలో ఉండే చీకటిని అంతటినీ గ్రసిస్తున్నది. ఎక్కువగా దేనినైనా తాగినవాడు లోపల అంతా ఇముడ్చుకోలేక బయటకు కొంత భాగాన్ని వమనం చేస్తాడు (కక్కుతాడు)కదా ! అదే రీతిలో సుదర్శననేమి తాను తాగిన తమస్సులో కొంతభాగాన్ని మరణించిన అసురుల భార్యల హృదయాలలో వమనం చేసింది. (వారి మనస్సు చీకటిగా చేయడం అంటే దుఃఖించేటట్లు చేయడమే) ఇటువంటి సుదర్శనుని నేమి మీ పాపాల పలు విధాలైన ప్రభావాన్ని దహింపజేయాలి.

శ్రీసుదర్శన నేమి మీకీర్తిని ప్రకాశింపజేయాలి.

30. కృష్ణాంభోదస్య భూషా కృతనయననయవ్యాహతి ర్భార్గవస్య
ప్రాప్తా మావేదయంతీ ప్రతిభటసుదృశా ముద్భటాం బాష్పవృష్టిమ్ ।
నిష్టప్తాష్టాపదశ్రీ స్సమ మమరచమూగర్జితై రుజ్జిహానా
కీర్తిం వః కేతకీభిః ప్రథయతు సదృశీం చంచలా చక్రధారా ॥

ఇందులో సుదర్శనుని నేమి, మెఱపులమధ్య సామ్యం సహృదయహృదయ రంజకంగా నిర్వహింపబడింది.

నీటిని గ్రహించిన మేఘం నల్లగా ఉంటుంది. భగవానుడుకూడా నీలమేఘ వర్ణుడు. నల్లని మేఘానికి మెఱపు భూషణం. నీలమేఘవర్ణుడైన స్వామికి సుదర్శననేమి భూషణం. మెఱపు మెఱసినపుడు కంటిచూపుకు అడ్డు కల్గడం సహజం. అదే విధంగా సుదర్శనుని నేమి శుక్రాచార్యుని కంటికి వ్యాహతిని- కల్గించింది. అంటే, అతని కన్నును గుడ్డిగా చేసింది. మెఱపు మెఱవగానే వర్షం కురుస్తుంది. అదే రీతిలో, సుదర్శనుని నేమి మెఱవగానే ప్రతిభటులు మరణించడంవల్ల, వారి భార్యల కళ్ళనుండి దుఃఖబాష్పవృష్టి కురుస్తుంది. మెఱపు, సుదర్శనుని నేమి- రెండూ బాగా కాచి శుద్ధిచేసిన మేలిమి బంగారు ఛాయను కల్గినవే. మెఱపుతో పాటు మేఘగర్జనలు విన్పిస్తాయి.



సుదర్శననేమికూడా దేవసైన్యాల విజయగర్జనలతో కూడి ఉంటుంది. ఇటువంటి రీతిలో మెఱపుతో సాటి వచ్చే సుదర్శనుని నేమి మీ కీర్తిని వృద్ధిచేయాలి. (మెఱపు మెఱసి మేఘం గర్జించి, వర్షం కురవగానే మొగలిపూలు పూచినట్లే, సుదర్శననేమి మెఱపులవల్ల, దేవసేనల విజయగర్జనలవల్ల మొగలిపూలవంటి మీ కీర్తి వికసించాలి.)

శ్రీసుదర్శన నేమి మీకు ఇంద్రియ నిగ్రహాన్ని కల్గించాలి.

31. వప్రాణాం భేదనీం యః పరిణతి మఖిలశ్లాఘనీయాం దధానః
క్షుణ్ణాం నక్షత్రమాలాం దిశి దిశి వికిరన్ విద్యుతా తుల్యకక్ష్యః ।
నిర్యాణేనోత్కటేన ప్రకటయతి నవం దానవారిప్రకర్షం
చక్రాధీశస్య భద్రో వశయతు భవతాం సప్రధి శ్చిత్తవృత్తిమ్ ॥

గజజాతిలో భద్రమనే ఒక జాతి విశేషం ఉన్నది. ఆ భద్రగజానికి, సుదర్శనుని నేమికి మధ్య సాధర్మ్యం చమత్కారంగా ప్రతిపాదింపబడుతున్నది ఈశ్లోకంలో.

నదీతీరాలను తొండంతో శిథిలం చేసి కూటగొట్టడం మదగజానికి సహజ గుణం. దీనికే తిర్యక్దంత ప్రహారమని పేరు. సుదర్శనుని నేమి శత్రువుల నగరప్రాకారాలను కూలగొడుతుంది. మదగజం నక్షత్రమాల అనే ఇరవైఏడు ముత్యాలతో కూర్చిన హారాన్ని తెంచి వేసి, పొడిపొడిగా చేసి చల్లడం దానికి సహజగుణం. సుదర్శననేమి తన ప్రతాపంతో నక్షత్రగణాలను అన్నిటినీ చూర్ణం చేస్తున్నది. గజాన్ని కట్టే కట్టుస్తంభానికి "కక్ష్యా" అని పేరు. ఇది విద్యుత్తువలె తళతళా మెఱుస్తుంది. దీనికి మదగజం కట్టబడి ఉంటుంది. సుదర్శనుని నేమి అయితే విద్యుత్తు వలె మెరుస్తుంది. మదగజం తన గండస్థలాలనుండి మదజలాన్ని స్రవింపజేస్తుంది. నేమికూడా దానవారి అయిన భగవానునకు శత్రునిరసనం ద్వారా గొప్ప ఉత్కర్షను కల్గిస్తుంది. మదించిన మగఏనుగు తన చిత్తవృత్తిని తన ఆడఏనుగుకు స్వాధీనం చేసేటట్లుగా, చక్రనేమి మీ ఇంద్రియాశ్వాలు మిమ్మలను లౌకికవిషయాలనే వీథులలోకి ఈడ్చుకొనిపోకుండా రక్షించాలి.

శ్రీసుదర్శన నేమి మీకు విజయాన్ని ఇవ్వాలి.

32. నాకౌకశ్శత్రుజత్రుత్రుటనవిఘటితస్కన్ధనీరంధ్రనిర్యత్-
నవ్యక్రవ్యాస్రహవ్యగ్రసనరసలసజ్జ్వాలజిహ్వాలవహ్నిమ్ ।
యం దృష్ట్వా సాంయుగీనం పున రపి విదధత్యాశిషో వీర్యవృద్ధ్యై
గీర్వాణా నిర్వృణానా వితరతు స జయం విష్ణుహేతిప్రధి ర్వః ॥

దేవతల శత్రువులైన అసురుల భుజస్కంధాలను సుదర్శనుని నేమి ఖండించి నపుడు తెగిపడిన ఆ భుజాలనుండి నిరంతరం స్రవించే కొత్త మాంసం, రక్తం అనే

హవిస్సును భుజించడంలోని ఆశతో అహమహమికగా నాట్యం జేసే జ్వాలలను కల అగ్నిని కల్గినదై ఉంటుంది - ఆ సుదర్శననేమి. యుద్ధంలో చాలా సమర్థం అయిన ఆ సుదర్శనుని నేమిని చూచి దేవతలు సంతోషించి, దానికి ఇంకా ఇంకా వీర్యవృద్ధి కలగాలని మంగళాశాసనాలను చేస్తున్నారు. అటువంటి చక్రనేమి మీకు జయాన్ని విశేషంగా కల్గించాలి.

శ్రీసుదర్శననేమి మీ అవిద్యను తీర్చాలి.

**33.** ధన్వాధ్వన్యస్య ధారాసలిల మివ ధనం దుర్గతస్యేవ దృష్టిః
జాత్యంధస్యేవ పంగోః పదవిహృతి రివ ప్రీణనీ ప్రేమభాజామ్ ।
పత్యు ర్మాయాః క్రియాయాం ప్రకటపరిణతి ర్విశ్వరక్షాక్షమాయాం
మాయా మాయామినీం వః త్రుటయతు మహతీ నేమి రస్త్రేశ్వరస్య ॥

ఎడారిలో ప్రయాణం చేస్తూ, చాలా దాహంతో నాలుక ఎండిపోయి, పిడుచ కట్టేవానికి చల్లని నీటిప్రవాహంలోని జలం లభించినట్లుగా, గర్భదరిద్రునకు ధనలాభం కలిగేటట్లుగా, పుట్టగుడ్డికి నేత్రలాభం కలిగేటట్లుగా, కుంటివానికి స్వేచ్ఛాసంచారయోగ్యత కలిగేటట్లుగా, శ్రీసుదర్శనుని నేమి భక్తులకు ఎంతో సంతోషాన్ని తన విశ్వరక్షణ సామర్థ్యాన్ని చూపడంద్వారా కల్గిస్తున్నది. అటువంటి ఆయుధప్రభువు అయిన సుదర్శనుని నేమి మీ అనాది అయిన అవిద్యను విచ్ఛిన్నం చేయాలి.

శ్రీసుదర్శననేమి మీకు సంపదను ఇవ్వాలి.

**34.** త్రాణం యా విష్టపానాం వితరతి చ యయా కల్ప్యతే కామపూర్తిః
స స్థాతుం యత్పురస్తాత్ ప్రభవతి కలయాఽప్యోషధీనా మధీశః ।
ఉన్మేషో యాతి యస్యా న సమయనియతిం సా శ్రియం వః ప్రదేయాత్
న్యక్కృత్య ద్యోతమానా త్రిపురహరదృశం నేమి రస్త్రేశ్వరస్య ॥

త్రిపురాలను దహించిన, అగ్నిమయం అయిన శివుని కంటిని సుదర్శనుని నేమి తన స్వభావంతో మించి ఉండే ఆ విషయమే ఈ శ్లోకంలో ప్రస్తుతం.

శివుడు లోకసంహారకర్త. కనుక అతని నేత్రం లోకసంహారకారి. కాని, చక్రనేమి లోకాలను రక్షిస్తున్నది. అంతేకాదు, శివుని నేత్రం కేవలం లోకసంహారాన్ని మాత్రమే నిర్వహించగా, చక్రనేమి సృష్టిస్థితిలయాలను మూడిటిని నిర్వహించడంద్వారా శివుని కంటికంటే ఆధిక్యాన్ని కల్గి ఉన్నది. శివుడు తపస్సు చేసేటపుడు అతని సమాధికి మన్మథుడు భంగం కల్గించగా, ఆ మన్మథుని శివుడు తన ఫాలనేత్రంతో దహించి వేశాడు. అందువల్ల శివుని నేత్రం కామనాశకం. కాని, చక్రనేమి భక్తుల కామాలను పూర్తిచేస్తుంది. (కామం అంటే మన్మథుడని, కోరిక అని అర్థం.) అంతేకాదు, శివుని నేత్రం ఒకవేళ కామమనే శత్రువును దహిస్తుందని అన్నా, చక్రనేమి మిగిలిన అయిదు క్రోధలోభమోహమదమాత్సర్యాలనే ఆఱుగురు శత్రువులను వధిస్తుందనే ఆధిక్యాన్ని కల్గి ఉన్నది. దక్ష ప్రజాపతిశాపంవల్ల క్షయరోగాన్ని పొంది, కళలను పోగొట్టుకొన్న చంద్రుడు ఏకకళావశిష్టుడై శివుని శరణు వేడి, అతనికంటిముందు ఒక్కకళతో అయినా నిలువగలిగాడు. కాని, సుదర్శననేమి ముందుమాత్రం ఆ చంద్రుడు కళామాత్రంగా కూడా నిలువలేడు. ముక్కంటి కన్ను ఏదో ఒక సమయంలోనే ఉన్మేషాన్ని -అంటే మన్మథదహనసమయంలోనో, సంహారకాలంలోనో విజృంభణాన్ని పొందింది. అందువల్ల కాలనియతిని కల్గి ఉన్నది. కాని, చక్రనేమియొక్క ఉన్మేషం- అంటే- ప్రకాశం సార్వకాలికం. ఈ రీతులలో శివుని ఫాలనేత్రంకంటే ఆధిక్యాన్ని కల్గిన చక్రనేమి మీకు సంపదను అనుగ్రహించాలి.

శ్రీసుదర్శననేమి మీ పాపసమూహాన్ని ఎగురగొట్టాలి.

**35.** నక్షత్రక్షోదభూతిప్రకరవికిరణశ్వేతితాశావకాశా
జీర్ణైః పర్ణై రివ ద్యాం జలధరపటలై శ్ఛూర్ణితై రూర్ణువానా ।
ఆజావాజానవాజానతరిపుజనతారణ్య మావర్తమానా
నేమి ర్వాత్యేవ చాక్రీ ప్రణుదతు భవతాం సంహతం పాపతూలమ్ ॥

చక్రనేమికి సుడిగాలికి మధ్యసామ్యం ఇందులో వర్ణింపబడుతున్నది.

సుడిగాలి భూమిపై ఉండే భస్మాన్ని గ్రహించి, దానిని పైకి ఎగురగొడుతుంది. దిక్కులను అన్నిటినీ తెల్లగా చేస్తుంది. చక్రనేమికూడా నక్షత్రసమూహాలను తన రాపిడితో పొడిపొడిగా చేసి, ఆ చూర్ణంతో దిక్కులను అన్నిటినీ తెల్లగా చేస్తున్నది. పండి రాలిపోయిన ఆకులను అన్నిటినీ సుడిగాలి ఎగురగొట్టి, వాటితో ఆకాశాన్ని ఆచ్ఛాదిస్తుంది. చక్రనేమి మేఘసమూహాలను చూర్ణం చేసి, వాటితో ఆకాశాన్ని కప్పివేస్తుంది. సుడిగాలి అరణ్యంలో సుడులు తిరుగుతూ వస్తుంది. వృక్షాలను పెళ్ళగిస్తుంది. చక్రనేమికూడా అసురులు, రాక్షసులు- అనే మహారణ్యంలో సుడులు తిరుగుతుంది. వారిని కూలగొడుతుంది. ఇటువంటి చక్రనేమి, సుడిగాలి దూదిపింజలను ఎగురగొట్టినట్లు, మీ పాపరాశిని ఎగురగొట్టాలి.

శ్రీసుదర్శన నేమి మీ సుఖాన్ని విస్తృతం చేయాలి.

**36.** క్షిప్త్వా నేపథ్యశాటీ మివ జలదఘటాం జిష్ణుకోదండచిత్రాం
తారాపుంజం ప్రసూనాంజలి మివ విపులే వ్యోమరంగే వికీర్య ।
నిర్వేదగ్లానిచింతాప్రభృతిపరవశా నంతరా దానవేంద్రాన్
నృత్య న్నానాలయాఢ్యం నట ఇవ తనుతాం శర్మ చక్రప్రధి ర్వః ॥

చక్రనేమికి, నటునకు సాధర్మ్యం ఇందులో నిర్వహింపబడుతున్నది.

నటుడు రంగస్థలంలోకి ప్రవేశించేటపుడు పలు వర్ణాలను కల్గి, అందంగా ఉండే తెరను తొలగించుకొని పుష్పాంజలిని సామాజికులకు, ఇష్టదైవానికి సమర్పించి, లయబద్ధంగా నాట్యాన్ని చేస్తాడు. సామాజికులకు నిర్వేదం, గ్లాని, చింతమొదలైన వ్యభిచారి భావాలను పొందినవారినిగా వారిని చేస్తాడు. చక్రనేమికూడా, ఆకాశమనే రగస్థలంలో ప్రవేశిస్తున్నది. ఆ రంగస్థలానికి కల తెర మేఘసమూహాలే. అవి పలు వర్ణాలను కల ఇంద్రధనుస్సుతో అందంగా ఉన్నవి. ఆ మేఘాలను చక్రనేమి ఎగురగొడుతూ పోవడం నటుడు రంగస్థలంలోని తెరను తొలగించినట్లున్నది. చక్రనేమి నక్షత్రసమూహాన్ని వెదజల్లడం నటుడు పుష్పాంజలిని సమర్పించినట్లున్నది. నటుడు సామాజికులకు నిర్వేదాది పలు భావాలను కల్గించినట్లే, చక్రనేమికూడా అసురులకు, రాక్షసులకు శోకం, శ్రమ, చింత మొదలైన భావాలను కల్గిస్తుంది. నటుడు పలు లయలకు అనుగుణంగా నర్తిస్తాడు. కనుక, అతని నాట్యం నానాలయాఢ్యం. చక్రనేమి గమనంకూడా నానాలయాఢ్యమే. అంటే- పలు లయాలను-ధ్వంసాలను శత్రువులకు కల్గిస్తుంది. ఇటువంటి చక్రనేమి మీ సుఖాన్ని విస్తృతం చేయాలి.

శ్రీ సుదర్శననేమి మీకు రక్షణను కల్గించాలి.

37. దౌర్గత్యప్రౌఢతాపప్రతిభటవిభవా విత్తధారా స్సృజంతీ
గర్జంతీ ఛీత్క్రియాభిః జ్వలదనలశిఖోద్దామసౌదామనీకా ।
అవ్యాత్ క్రవ్యాద్వధూటీనయనజలభరైః దిక్షు నవ్యానవ్యాన్
పుష్యంతీ సింధుపూరాన్ రథచరణపతేః నేమి కాదంబినీ వః ।

చక్రనేమి ఇందులో మేఘమాలగా అభివర్ణింపబడుతున్నది.

మేఘమాల అసహ్యమైన, సూర్యతాపాన్ని వర్షధారలద్వారా ఉపశమింపజేస్తుంది. చక్రనేమి దౌర్గత్యం అంటే దారిద్ర్యంవల్ల కల్గిన గొప్ప మనోవేదనను గొప్ప ధనవర్షాన్ని కురిపించడంద్వారా నాశనం చేస్తుంది. అంటే చక్రనేమి మహైశ్వర్యప్రదం. మేఘమాల చీత్కారధ్వనివిశేషాలతో గర్జిస్తుంది. చక్రనేమి కూడా అటువంటిదే. మేఘమాలలో భయంకరం అయిన మెఱపు మెఱసినట్లే, నేమిలోకూడా అగ్నిజ్వాల మెఱుస్తుంది. మేఘమాల అమితంగా వర్షించి, కనపడినచోట అంతా నూతనమైన నదీప్రవాహాలను ప్రవహింపజేస్తుంది. చక్రనేమి అసురులను వధించి, వారి భార్యల కన్నీటి ప్రవాహాలను ప్రవహింపజేస్తుంది. మేఘమాలవల్ల ప్రవహించే ప్రవాహాలు ఓడలతో దాటడానికి సాధ్యం కానివిగా ఉంటాయి. కన్నీటి ప్రవాహాలు కూడా నిరోధించడానికి వీలు కానివి. ఈవిధంగా మేఘమాలవంటి సుదర్శనుని నేమి మిమ్ములను కాపాడాలి.



శ్రీసుదర్శననేమి మీ అపేక్షితాలను ఇవ్వాలి.

38. సందోహం దానవానా మజసమజ మివాఽఽలభ్య జాజ్వల్యమానే
వహ్నౌ వహ్నాయ జుహ్వ త్రిదశపరిషదే స్వస్వభాగప్రదాయీ ।
స్తోత్రైః బ్రహ్మాదిగీతైః ముఖరపరిసరం శ్లాఘ్యశస్త్రప్రయోగం
ప్రాప్త స్సంగ్రామసత్రం ప్రధిరసురరిపోః ప్రార్థితం ప్రస్నుతాం వః ॥

ఇందులో యుద్ధభూమిని యజ్ఞవాటికగా, అందలో వ్యాపించే చక్రనేమిని యజ్వగా రూపించడం విషయం.

సంగ్రామమనే యజ్ఞంలో చక్రనేమి యజ్వ. ఈ యజ్ఞంలో ఈ యజమానుడు చేసేది ఏమంటే- **"పశూన్ ఆలభేత"** అనే రీతిలో యజ్ఞాన్ని నిర్వహించే యజమానుడు సమంత్రకంగా మేకలను ఆలంభనం చేస్తాడు. అంటే, వధించి అగ్నిలో అర్పిస్తాడు. చక్రనేమి అనే యజమాని అసురవర్గాన్ని వధించి, సుదర్శనాగ్నిలో వ్రేలుస్తాడు. యజమాని యజ్ఞంలో ఇంద్రాదిదేవతలను ఉద్దేశించి స్తుతిస్తూ భాగాలను వధించి, వారి వారి హవిర్భాగాలను అర్పిస్తాడు. చక్రనేమి అనే యజమానికూడా అసురులనే మేకలను వధిస్తున్నందున, అంతకుముందు అసురుల బాధవల్ల తమ తమ హవిర్భాగాలను పొందలేని ఇంద్రాదిదేవతలు ఇపుడు తమ తమ హవిర్భాగాలను పొందగల్గుతున్నారు. యుద్ధరంగంలో పలు ఖడ్గాది శస్త్రాల ప్రయోగం ఉంటుంది. యజ్ఞవాటికలో కూడా శస్త్ర మనబడే మంత్రవిశేషాల ప్రయోగం ఉంటుంది. యుద్ధరంగంలో సుదర్శననేమి పరాక్రమాన్ని చూచి బ్రహ్మాదిదేవతలు "భళీ ! భళీ !" అంటూ గొప్పగా చేసిన స్తుతులకు ఆ యుద్ధరంగం అంతా ప్రతిధ్వనిస్తున్నది. యజ్ఞవాటికకూడా బ్రహ్మ, ఉద్గాత, హోత, అధ్వర్యువు అనే యాగనిర్వాహకులు పఠించే, శస్త్రాలనబడే మంత్రవిశేషాల పఠనంవల్ల ప్రతిధ్వనిస్తుంది. ఇటువంటి చక్రనేమి మీ కోరికలను అన్నిటినీ తీర్చాలి.

## అరవర్ణనమ్

శ్రీసుదర్శనుని అరాలు మిమ్ములను మీ అంతిమయాత్రలో రక్షించాలి.

39. ఉత్పాతాలాకల్పా న్యసురపరిషదా మాహవప్రార్థినీనాం
అధ్వానధ్వావబోధక్షపణచణతమఃక్షేపదీపోపమాని ।
త్రైలోక్యాగారభారోద్వహనసహమణిస్తంభసమ్పత్సఖాని
త్రాయంతా మంతిమాయాం విపది సపది వోఽఽరాణి సౌదర్శనాని ॥

ఇక ఈ శ్లోకంనుండి 50వ శ్లోకంవరకు వరుసగా 12 శ్లోకాలలో అరాల (చక్రం లోపల ఉండే ఆకుల వంటివి) స్తుతిచేయబడుతున్నవి. పూర్వం తెలిపినట్లుగా

చక్రాంగాలు అయిన అరాల వర్ణన చక్రవర్ణనలోకే పర్యవసిస్తుంది. పలు ఉపమల ద్వారా ఈ వర్ణన సాగుతున్నది.

ఎల్లప్పుడూ యుద్ధాన్ని వాంఛించే అసురులయొక్క వినాశాన్ని సూచించే, అశుభశకునం అయిన కొఱివికట్టెలవంటివి సుదర్శనుని అరాలు. సన్మార్గ-దుర్మార్గాలు ఏవో తెలియకుండా మోహాన్ని పొందినవారికి, సరి అయిన దారిని చూపే చేతిదీపాలవలె అవి కన్పిస్తున్నవి. ముల్లోకాలనే భవనం బరువును మోసే మణిమయస్తంభాలవంటివి అవి. ఇటువంటి సుదర్శనుని అరాలు శరీరం కట్టెగా మారి, కఫవాతపిత్తాలతో కంఠం అడ్డగింపబడే మీ అంతిమకాలంలో మీకు రక్షణను కల్గించాలి.

శ్రీసుదర్శనుని అరాలు మీకు సంతోషాన్ని కల్గించాలి.

**40.** జ్వాలాజ్వాలప్రవాలస్తబకితశిరసో నాభి మావాలయంత్యః
సిక్తా రక్తాంబుపూరైః శకలితవపుషాం శాత్రవానీకినీనామ్ ।
చక్రాక్రీడప్రరూఢాభుజగశయభుజోపఘ్ననిఘ్నప్రచారాః
పుష్యంత్యః కీర్తిపుష్పాణ్యరకనకలతాః ప్రీతయే వః ప్రథంతామ్ ॥

సుదర్శనచక్రంలోని అరాలు ఇందులో కనకలతలుగా వర్ణింపబడుతున్నాయి. లోకంలోని విహారోద్యానాలలో పెరిగేటట్లే సుదర్శనుని అరాలనే సుదర్శనమనే ఉద్యానవనంలో మొలిచి పెరిగాయి. లతలు పాదులలో పెరుగుతాయి. ఈ సుదర్శనుని అరాలనే లతలు నాభి అనే పాదులో పెరుగుతాయి. లతలు పాదుల్లో నీరుపోసి వృద్ధి చేయబడేటట్లే, ఖండఖండాలుగా చేయబడ్డ అసురుల శరీరాలనుండి స్రవించిన రక్తప్రవాహాలనే నీటి ప్రవాహాలతో ఈ లతలు తడుపబడుతున్నాయి. ఉద్యానవనంలోని లతల సంచారాలు పట్టుకొమ్మను ఆధారంగా చేసికొని ఉండేటట్లే, చక్రారాలనే లతల సంచారాలు భగవానుని భుజాలనే పట్టుకొమ్మను ఆధారంగా చేసికొని ఉంటాయి. లతలు ఎఱ్ఱని చిగుళ్ళను అగ్రభాగాలలో కల్గి, విశేషంగా పుష్పిస్తాయి. అరాలనే లతలు జ్వాలలు అనే చిగుళ్ళను అగ్రభాగాలలో కల్గి, విశేషంగా ప్రకాశిస్తాయి. ఇటువంటి సుదర్శనుని అరాలనే బంగారు తీగలు మీ సంతోషాన్ని వృద్ధిచేయాలి.

శ్రీసుదర్శనుని అరాలు మీకు బుద్ధిబలాన్ని, వాక్సామర్థ్యాన్ని ఇవ్వాలి.

**41.** జ్వాలాజాలాబ్ధిముద్రం క్షితివలయ మివా బిభ్రతీ నేమిచక్రం
నాగేంద్రస్యేవ నాభేః ఫణపరిష దివ ప్రౌఢరత్నప్రకాశా ।
దత్తాం వో దివ్యహేతే ర్మతి మరవితతిః ఖ్యాతసాహస్రసంఖ్యా
సంఖ్యావత్సంఘచిత్తశ్రవణహరగుణస్యందిసందర్భగర్భామ్ ॥



సుదర్శనుని అరాలకు, ఆదిశేషుని పడగల సమూహానికి గల సామ్యం ఇందులో వివక్షితం.

ఆదిశేషుని పడగలు సముద్ర పరివేష్టితం అయిన భూమండలాన్ని భరిస్తున్నది. అరాలు నేమి మండలాన్ని భరిస్తున్నవి. అరాలు పడగలు అయితే మఱి సర్పం ఏది ? అంటే, సుదర్శనుని నాభి చుట్టచుట్టుకొని ఉండే ఆదిశేషుడుగా భాసిల్లుతున్నాడు. చక్రనాభినుండి అరాలు అనేకంగా విస్తరించడాన్ని చూస్తే, అవి కుండలాకారంగా చుట్టుకొన్న ఆదిశేషుని పడగలు విస్తరించి ఉన్నట్లున్నవి. ఆదిశేషుని పడగలలో ప్రకాశించే వేలాది గొప్ప రత్నాలుండేటట్లే, వేయి అరాలుకూడా రత్నప్రకాశంవంటి ప్రకాశాన్ని కల్గి ఉంటాయి. ఇటువంటి శ్రీసుదర్శన చక్రంయొక్క అరాలు మీకు పండితుల మనస్సును మెచ్చే అర్థాన్ని, వారిచెవులు ఆనందించే శబ్దాన్ని కల్గిన వాక్కులను పలికే సామర్థ్యాన్ని మీకు అనుగ్రహించాలి.

శ్రీసుదర్శనుని అరాలు మీకు అధికమైన గొప్పతనాన్ని ఇవ్వాలి.

**42.** బ్రహ్మేశోపక్రమాణాం బహువిధవిమతక్షోదసమ్మోదితానాం
సేవాయై దేవతానాం దనుకులరిపోః పిండికాద్యంగభాజామ్ ।
తత్తద్ధామాంతసీమావిభజనవిధయే మానదండాయమానా
భూమానం భూయసా వో దిశతు దశశతీ భాస్వరాణా మరాణామ్ ॥

బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలైన దేవతలు తమ తమ శత్రువులను శ్రీసుదర్శనుడు నిరసించాడనే కారణంచేత కృతజ్ఞతతో శ్రీసుదర్శనుని సేవిస్తూ ఉంటారు. వారు నాభిమొదలైన చక్రాయుధంయొక్క అంగాలను భజిస్తూ ఉంటారు. అటువంటివారికి "ఇదిగో ఇది బ్రహ్మ చోటు, ఇది శివుని చోటు'' అని వారి వారి స్థావరవివరాలను విభజించి చూపడానికి తగిన కొలబద్దలా ? ఇవి- అనే రీతిలో ఉండే అరాలు మీకు గొప్పతనాన్ని అధికంగా ఇవ్వాలి. దేవతాసంఘాలు నమస్కరించాలని వచ్చినపుడు వారిమధ్య పరస్పరసంమర్దం కలుగకుండా ఉండడంకోసం "ఇక్కడ బ్రహ్మ ఉండాలి; ఇక్కడ శివుడు, ఇంద్రుడు ఉండాలి- అని నియమించి స్థల విభాగాన్ని నిర్ణయించి చెప్పే ప్రయత్నంలో అరాలు కొలబద్దలయ్యాయి. కాబోలు- అన్నది ఇక్కడి ఉల్లేఖం.

శ్రీసుదర్శనుని అరాలు మీకు మంగళాన్ని కల్గించాలి.

**43.** జ్వాలాకల్లోలమాలానిబిడపరిసరాం నేమివేలాం దధానే
పూర్వేణాక్రాంతమధ్యే భువనమయహవిర్భోజినా పూరుషేణ ।

ప్రస్ఫూర్జత్ప్రాజ్యరత్నే రథపదజలధా వేధమానైః స్ఫులింగైః
భద్రం వో విద్రుమాణాం శ్రియ మరవితతిః విస్తృణానా విధత్తామ్ ॥

శ్రీసుదర్శనుని ఒక సముద్రంగా, ఆ సుదర్శనుని అరాలనుండి వెలువడే విస్ఫులింగాలను పగడాలుగా వర్ణించడం ఇందులోని అంశం.

శ్రీసుదర్శనుడు ఒక సముద్రం. అది జ్వాలలు అనే కెరటాలు ప్రవహించే దట్టమైన పరిసర ప్రదేశాన్ని కల్గి ఉన్నది, నేమి అనే తీరాన్ని కల్గినది, ముల్లోకాలను భుజించే పురాణపురుషునిచే అధిష్ఠింపబడ్డ మధ్యప్రదేశాన్ని ఈ శ్రీసుదర్శనాబ్ధి కల్గి ఉంటుంది. సముద్రంలోకూడా జలరూపమైన హవిస్సును భుజించే పురుషుడు ఉంటాడుకదా ! సముద్రంలో ప్రకాశించే గొప్ప గొప్ప రత్నాలు ఉండేటట్లే చక్రాయుధం కూడా పలు రత్నాల కాంతిని కల్గి ఉంటుంది. ఈ సుదర్శనం అనే సముద్రంలోని అరాలనుండి పుట్టే అగ్నికణాలు పగడాలవలె ఉంటాయి. ఇటువంటి సుదర్శనుని అరాల సమూహం మీకు మంగళాన్ని కలుగజేయాలి.

శ్రీసుదర్శనుని అరాలు మీకు క్షేమాన్ని నిరాటంకంగా ఇవ్వాలి.

**44.** నాసీరస్వైరభగ్నప్రతిభటరుధిరాసారధారావసేకాన్
ఏకాంతస్మేరపద్మప్రకరసహచరచ్ఛాయయా ప్రాప్యనాభ్యా ।
ముక్తానీవాంకురాణి స్ఫురదనలశిఖాదర్శితప్రాక్ప్రవాలాని
అవ్యాఘాతేన భవ్యం ప్రదదతు భవతాం దివ్యహేతేరరాణి ॥

శ్రీసుదర్శనుని నాభి పద్మంగా, అందులోని అరాలు ఆ పద్మబీజాల నుండి వెలువడే అంకురాలుగా ఇందులో తెలుపబడుతున్నవి.

సుదర్శనుని నాభి ఎటువంటిది అంటే, బాగా వికసించిన పలు తామరపూల శోభవంటి శోభను కల్గి ఉంటుంది. ఇటువంటి నాభిని బీజంగా భావిస్తూ, అరాలను వాటినుండి పుట్టిన అంకురాలు అని అంటున్నారు. లోకంలో బీజాలనుండి అంకురాలు పుట్టాలి అంటే అవి నీటితో తడుపబడాలికదా ! శ్రీసుదర్శనంచేత దెబ్బతిని, వికలాంగులై మరణించిన అసురుల, రాక్షసుల రక్తధారలే ఆ నీటి ప్రవాహం. దానిచేత తడుపబడ్డ నాభినుండి అరాలనే అంకురాలు పుట్టాయి. అంకురాల చివరలో మొట్టమొదటి చిగుళ్ళు ఉండేటట్లే, అరాల చివరలో జ్వలించే అగ్నిశిఖలు అనే చిగుళ్ళు ఉన్నాయి. ఇటువంటి అరాలు మీకు అడ్డు లేని క్షేమాన్ని కలుగజేయాలి.



శ్రీసుదర్శనుని అరాలు మీకు ఉన్నతపదవిని ఇవ్వాలి.

**45.** దావోల్కామండలీవ ద్రుమగణగహనే బాడబస్యేవ వహ్నేః
జ్వాలావృద్ధి ర్మహాబ్ధౌ ప్రవయసి తమసి ప్రాత రర్కప్రభేవ ।
చక్రే యా దానవానాం హయకరటిఘటాసఙ్కటే జాఘటీతి
ప్రాజ్యం సా వః ప్రదేయాత్ పద మరపరిషత్ పద్మనాభాయుధస్య ॥

వృక్షాలు దట్టంగా ఉండే అడవిలోని దావాగ్నినుండి పుట్టిన జ్వాల ఆ అడవిని దహించే ఉల్కల సమూహంవలె, సముద్రంలోని బడబాగ్నినుండి పుట్టిన జ్వాలల వృద్ధివలె, కటిక చీకటిలో ప్రాతఃకాలంలో ఉదయించిన సూర్యుని కాంతివలె సుదర్శనుని అరల సమూహం ప్రకాశిస్తున్నది. అది అసురులసైన్యంలోని గజతురగాది సమూహాలలో వ్యాపించి, వానిని, అసురులను కబళీకరిస్తున్నది. అటువంటి గొప్పతనాన్ని కల సుదర్శనుని అరసమూహం మీకు ఉన్నతపదవిని అనుగ్రహించాలి.

శ్రీసుదర్శనుని అరాలు మీకు కీర్తిని కల్గించాలి.

**46.** తాపాత్ దైత్యప్రతాపాతపసముపచితాత్ త్రాయమాణం త్రిలోకీం
లోలైః జ్వాలాకలాపైః ప్రకటయదభితః చీనపట్టాంచలాని ।
ఛత్రాకారం శలాకా ఇవ కనకకృతాః శౌరిదోర్దండలగ్నం
భూయాసు ర్భూషయంత్యో రథచరణ మరస్ఫూర్తయః కీర్తయే వః ॥

శ్రీసుదర్శనం ఒక గొడుగుగా, అందులోని అరాలు ఆ గొడుగులోని కమ్ములుగా ఇందులో చమత్కరింపబడుతున్నది.

శ్రీసుదర్శనం ఒక అద్వితీయఛత్రం. లోకంలోని గొడుగు ఎండవల్ల కలిగే తాపాన్ని తీరుస్తుంది. శ్రీసుదర్శన చక్రం భగవానుని శ్రీపాదచ్ఛాయలో ఒదిగి ఉజ్జీవించలేక, అసురుల, రాక్షసుల దుర్మార్గం అనే తాపంవల్ల బాధపడేవారిని చల్లబఱచి ఉజ్జీవింపజేస్తుంది. గొడుగుకు చీనాదేశపు పట్టువస్త్రాల జాలరులు చుట్టూ వేలాడదీయబడి ఉంటాయి. సుదర్శనచక్రంలో జ్వాలాకలాపాలు చుట్టూ మెఱవడాన్ని చూస్తే వాటిని తలపిస్తున్నది. గొడుగు ఒక దండానికి అమర్చబడి ఉంటుంది. సుదర్శనం భగవానుని బాహువు అనే దండంలో లగ్నమై ఉంటుంది. ఇట్లు ఛత్రం అనేటట్లుగా ఉండే సుదర్శనంలో తళాతళా మెఱిసే అరాలు గొడుగులోని బంగారు కమ్ములవలె భాసిల్లుతున్నాయి. ఇటువంటి సుదర్శనఛత్రం మీకు కీర్తిని కల్గించాలి.

శ్రీసుదర్శనుని అరాలు మీ శత్రువులను తఱిమి కొట్టాలి.

**47.** నాభీశాలానిఖాతాం నహనసముచితాం వైరిలక్ష్మీవశానాం
సంయద్వారీహృతానాం సమనువిదధతీ కాంచనాలానపంక్తిమ్ ।
రాజ్యాచ ప్రాజ్యదైత్యవ్రజవిజయమహోత్తంభితానాం భుజానాం
తుల్యా చక్రారమాలా తులయతు భవతాం తూలవచ్ఛత్రులోకమ్ ॥

సుదర్శనుని అరాలు స్వర్ణమయాలైన గజబంధనస్తంభాలవలె భాసిస్తున్నవి అన్నది పూర్వార్ధంలోని అంశం.

సుదర్శనుని నాభి శత్రువులైన అసురుల, రాక్షసుల సంపదలనే ఆడ ఏనుగులను బంధించే గోయి. వాటిని బంధించే కట్టుస్తంభాల వరుసగా అరాలున్నాయి. (యుద్ధరంగంలో అసురులను, రాక్షసులను అరల సమూహాలు నిర్వీర్యులుగా చేస్తున్నాయని, వారి సంపదలను సుదర్శనుని అరాలు హరిస్తున్నాయని దీని భావం.) గొప్ప విజయాన్ని సాధించినపుడు వీరులు బాహువులను ఉన్నతంగా పైకెత్తి జయధ్వానాన్ని చేయడం లోకపరిపాటి. సుదర్శనుని అరాలుకూడా దానవవర్గాన్ని జయించిన సంతోషాతిశయంచేత ఎత్తిన బాహువులవలె ఉన్నాయి. ఇటువంటి అరాల మాల మీ శత్రుగణాన్ని దూదినివలె ఎగురగొట్టాలి.

శ్రీసుదర్శనుని అరాలు లోకాలను ఆనందింప జేయాలి.

**48.** ఆనేమే శ్చక్రవాలా త్త్విష ఇవ వితతాః పిండికా చండదీప్తేః
దీప్తా దీపా ఇవారా ద్గహనరణతమీగాహినః పూరుషస్య ।
శాణే రోషాణితానాం రథచరణమయే శత్రుశౌండీర్యహేమ్నాం
రేఖాః ప్రత్యగ్రలగ్నా ఇవ భువన మరశ్రేణయః ప్రీణయంతు ॥

అరాల పంక్తి ఒక్కొక్క పాదంలో ఒక్కొక్క రీతిలో ఉల్లేఖించబడుతున్నది. సుదర్శనుని నేమి అనే చక్రవాళపర్వతంవరకు వ్యాపించిన నాభి అనే సూర్యుని కిరణాలవలె అరాలు ఉన్నాయి. ప్రవేశించడానికి సాధ్యం కాని యుద్ధరంగం అనే కటిక చీకటిలో ప్రవేశించే సుదర్శనపురుషునకు దారి చూపించడంకోసం వెలిగించిన కరదీపికలవలె ఉన్నాయి. సుదర్శనం అనే గీటురాయిపై అసురుల, రాక్షసుల ప్రతాపం అనే బంగారుకడ్డీని సానబట్టి చూచినపుడు ఆ సానపై అపుడే అంటుకొన్న రేఖలవలె సుదర్శనుని అరాలున్నాయి. ఇటువంటి అరాలు లోకాన్ని సంతోషింపజేయాలి.



శ్రీసుదర్శనుని అరాలు మీకు గొప్ప సంపదను ఇవ్వాలి.

**49.** దీప్తై రర్చిః ప్రరోహైః దలవతి విధృతే బాహునాలేన విష్ణోః
ఉద్యత్ ప్రద్యోతనాభం ప్రథయతి పురుషం కర్ణికావర్ణికాయామ్ ।
చూడాలం వేదమౌలిం కలయతి కమలే చక్రనామ్నోపలక్ష్యే
లక్ష్మీం స్ఫారా మరాణి ప్రతివిదధతు వః కేసరశ్రీకరాణి ॥

ఇందులో సుదర్శనం తామరపూవుగా, అందులోని అరాలు తామరపూవులోని కేసరాలుగా వర్ణింపబడుతున్నాయి.

వర్తులాకారంగా జ్వలించే జ్వాలల సమూహం అనే చిన్నరేకులను కల్గినది ఈ సుదర్శనకమలం. తామరపూవును కాడ మోస్తున్నట్లే ఈ కమలాన్ని భగవానుని బాహువనే నాళం మోస్తున్నది. తామరమధ్యలో తళతళ మని మెఱిసే కర్ణిక ఉన్నట్లే ఉదయకాలంలోని సూర్యునివలె గొప్పగా వెలిగే సుదర్శనపురుషుని కర్ణికగా ఈ తామరపూవు కల్గి ఉన్నది. కమలం కాంతశిరస్సును అలంకరించేటట్లే, సుదర్శనం వేదకాంత శిరస్సును భూషిస్తున్నది. ఈ రీతిలో కమలంవలె భాసించే సుదర్శనునిలో ఉండే అరాలు ఆ కమలంలోని కేసరాలవలె ఉన్నాయి. ఆ అరాలు మీకు గొప్ప సంపదను కలుగజేయాలి !

శ్రీసుదర్శనుని అరాలు మీకు పుష్కలమైన ఐశ్వర్యాన్ని ఇవ్వాలి.

**50.** ధాతుస్యందై రమందైః కలుషితవపుషో నిర్ఝరాంభఃప్రపాతాన్
అర్చిష్మత్యా స్వమూర్త్యా రథచరణగిరే ర్నేమినాభీతటస్య ।
వ్యాకుర్వాణాఽరపంక్తిః వితరతు విభుతా విస్తృతిం విత్తకోటీ-
కోటీరచ్ఛత్రపీఠీకటకకరిఘటాచామరస్రగ్విణీం వః ॥

ఇందులో సుదర్శనుడు పర్వతంగా, నేమి, నాభి ఆ పర్వతతటంగా, అరపంక్తి గైరికాదిధాతువులతో కలుషితం అయిన, ఎఱ్ఱని కొండవాగుల ప్రవాహంగా వర్ణింపబడుతున్నాయి.

నాభి, నేమి- అనే తీరాలను కల్గినదైన చక్రం అనే పర్వతంనుండి అంతులేని గైరికాది ధాతువులు కలిసిన, ఎఱ్ఱని కలుషితం అయిన నీటిని కల కొండవాగుల ప్రవాహాలను కాంతిమయం అయిన తన రూపంతో విస్తృతపఱచే సుదర్శనుని అరాల వరుస మీకు ధనరాసులు, కిరీటాలు, బాహువలయాలు మొదలైన ఆభరణాలను ధరించి, దివ్యమైన పూలమాలికలను అలంకరించుకొని, ఒకే గొడుగునీడలో రెండు పక్కల చామరగ్రాహిణులు చామరాలను వీస్తూ ఉండగా, దివ్యమైన సింహాసనంలో

వేంచేసి ఉండే భాగ్యాన్ని, పలు గజాలను కల గజాంతం అయిన ఐశ్వర్యాన్ని పొందడానికి తగిన వైభవవిస్తారాన్ని మీకు ఇవ్వాలి.

### నాభివర్ణనమ్

శ్రీసుదర్శనుని నాభి మీకు ఇంద్రైశ్వర్యంతో సాటివచ్చే ఐశ్వర్యాన్ని ఇవ్వాలి.

**51.** ఐక్యేన ద్వాదశానా మశిశిరమహసాం దర్శయంతీ ప్రవృత్తిం
దత్తః స్వర్లోకలక్ష్మ్యాః తిలక ఇవ ముఖే పద్మరాగద్రవేణ ।
దేయాత్ దైతేయదర్పక్షతికరణరణప్రీణితాంభోజనాభిః
నాభి ర్నాభిత్వ ముర్వ్యాః సురపతివిభవస్పర్ధి సౌదర్శనీ వః ॥

ఇక ఈ 61వ శ్లోకం నుండి 71వ శ్లోకం వరకు 11 శ్లోకాలలో సుదర్శనుని నాభి వర్ణింపబడుతున్నది. ఇందులో పలు ఉల్లేఖాలంకారాలతో ఈ వర్ణన సాగింది.

పన్నెండుమంది ఆదిత్యులు ఒక్కటిగా చేరి చక్రనాభిగా అయినదా ? అనే రీతిలో దాని ప్రకాశాతిశయం ఉన్నది. నాభి రంగులో ఎఱ్ఱగా ఉన్నందున, ఆకారంలో గుండ్రంగా ఉన్నందున స్వర్గలోకసామ్రాజ్యలక్ష్మిముఖంలో పద్మరాగ ద్రవంతో పెట్టబడ్డ తిలకంవలె శోభిల్లుతున్నది. (సుదర్శనునిద్వారా అసురుల రాక్షసుల సంహారం చేయబడినందున కల్గిన సంతోషంవల్ల దేవతాలక్ష్మి అలంకరించుకొన్నదని భావం.) యుద్ధంలో ప్రత్యర్థుల పీచాన్ని అణిచి, భగవానుని సంతోషపెట్టిన ఈ సుదర్శననాభి మీకు దేవేంద్రుని ఐశ్వర్యంతో సమానం అయిన ఐశ్వర్యాన్ని ఇవ్వాలి.

శ్రీసుదర్శననాభి మీకు శ్రేయస్సును ఇవ్వాలి.

**52.** శస్త్రశ్యామే శతాంగక్షితిభృతి తరలై రుత్తరంగే తురంగైః
త్వఙ్గన్మాతంగనక్రే కుపితభటముఖచ్ఛాయముగ్ధప్రవాలే ।
అస్తోకం ప్రస్నువానా ప్రతిభటజలధౌ పాటవం బాడబస్య
శ్రేయో వ స్సంవిధత్తాం శ్రితదురితహరా శ్రీధరాస్త్రస్య నాభిః ॥

శత్రుసైన్యాన్ని ఒక గొప్ప సముద్రంగా, చక్రనాభిని ఆ సముద్రంలోని బడబాగ్నిగా చెప్పడం ఇందులోని అంశం.

శత్రుసైన్యం ఒక పెద్ద సముద్రం. సముద్రం నీలవర్ణంలో ఉండే రీతిలోనే, ఈ శత్రుసైన్యమనే సముద్రం ప్రత్యర్థుల ఖడ్గాలతో నల్లగా ఉన్నది. (ఆయుధాలు ఇనుముతో చేయబడినవి కనుక నీలవర్ణంలో ఉంటాయి.) సముద్రంలో మైనాకుడు మొదలైన పర్వతాలున్నట్లే, ఈ సముద్రంలో శత్రువుల సైన్యంలోని రథాలనే పర్వతాలున్నాయి. సముద్రంలో సదా ఎగసిపడే కెఱటాలుంటాయి. ఈ సముద్రంలో కూడా సదా అటు ఇటు సంచరించే శత్రుసైన్యంలోని అశ్వాలే కెఱటాలు. అదేవిధంగా సైన్యంలోని ఏనుగులు వాటి ఆకారంలోని స్థౌల్యాన్నిబట్టి పెద్ద పెద్ద మొసళ్ళుగా తోస్తున్నవి. వీరావేశంతో ఎఱ్ఱబడ్డ శత్రువీరుల ముఖాలే శత్రుసైన్యమనే సముద్రంలోని ఎఱ్ఱని పగడాలు. ఈవిధంగా సముద్రం అనదగినట్లున్నది శత్రుసైన్యం. సముద్రంలో బడబాగ్ని ఉండేటట్లే, అది సముద్రంలోని నీటిని ఆవిరిచేసేటట్లే, ఈ శత్రుసైన్యమనే సముద్రంలో సుదర్శనుని నాభి ఒక బడబాగ్ని, అది శత్రువులకు ఆవిరిచేస్తున్నది- అంటే- సంహరిస్తున్నది. ఇటువంటి సుదర్శనుని నాభి మీకు శుభాన్ని కల్గించాలి.

శ్రీసుదర్శననాభి మిమ్ములను రక్షించాలి.

**53.** జ్వాలాచూడాలకాలానలచలనసమాడంబరా సాంపరాయం
యాసా వాసాద్య మాద్యత్సురసుభటభుజాస్ఫోటకోలాహలాఢ్యమ్ ।
దైత్యారణ్యం దహంతీ విరచయతి యశోభూతిశుభ్రాం ధరిత్రీం
సా వ శ్చక్రస్య నక్రస్యదమ్భదితగజత్రాయిణీ నాభి రవ్యాత్ ॥

దేవాసురుల యుద్ధభూమిలో ప్రవేశించి, అసురుల, రాక్షసుల సైన్యం అనే అరణ్యాన్ని నిశ్శేషంగా దహించి, శత్రువిధ్వంసనరూపం అయిన తెల్లని కీర్తి అనే భస్మాన్ని భూమండలంలో అంతటా వ్యాపింపజేసిన సుదర్శనుని నాభి, పూర్వం మొసలి నోటిలో చిక్కుకొని, బాధపడ్డ గజేంద్రుని రక్షించినట్లుగా, మిమ్ములను రక్షించాలి.

శ్రీసుదర్శననాభి మీకు క్షేమాన్ని కల్గించాలి.

**54.** విందంతీ సాంధ్య మర్చిః విదలితవపుషః ప్రత్యనీకస్య రక్తైః
స్ఫాయ న్నక్షత్రరాశిః దివిదిశి కణశః కీకసైః కీర్యమాణైః ।
నాకౌకఃపక్ష్మలాక్షీనవమదహసితచ్ఛాయయా చంద్రపాదాన్
రాథాంగీ విస్తృణానా రచయతు కుశలం పిండికా యామినీ వః ॥

ఇందులో సుదర్శనుని నాభి రాత్రిగా వర్ణింపబడుతున్నది. రాత్రి సాయం సంధ్యతో కూడుకొన్నదై, ఆ సంధ్యాకాలంలోని రక్తవర్ణాన్ని కల్గి ఉంటుంది. చక్రనాభి కూడా అసురుల, రాక్షసుల శరీరాలను ఖండించినపుడు వాటినుండి నిరంతరంగా కారే రక్తం కారణంగా సాంధ్యకాలిక శోభను పొందుతున్నది. రాత్రి నక్షత్రాలతో వ్యాపించి ఉంటుంది. ఈ నాభికూడా, శత్రువుల ఎముకలను పొడి చేసి, అంతటా వెదజల్లడం వల్ల నక్షత్రాలు వ్యాపించినట్లున్నది. రాత్రి చంద్రకిరణాలతో వ్యాపించి ఉంటుంది. నాభి అనే రాత్రికూడా శత్రుధ్వంసంవల్ల ఆనందించి, ఆ సంతోషాన్ని

లోపల ఇముడ్చుకోలేక పైకి వ్యక్తం చేసే రీతిలో బయటపడిన దేవతాస్త్రీల దరహాసమనే వెన్నెలతో వ్యాప్తమై ఉంటుంది. ఇటువంటి నాభి మీకు క్షేమాన్ని కల్గించాలి.

శ్రీసుదర్శన నాభి మీకు కీర్తిని ఇవ్వాలి.

55. నిస్సీమం నిస్సృతాయా భుజధరణిధరాఘాటతః కైటభారేః
ఆశాకూలంకషర్ధే రహితబలమహాంభోధి మాసాదయంత్యాః ।
చక్రజ్వాలాపగాయాః చలదరలహరీమాలికా దంతురాయాః
బిభ్రత్యావర్తభావం భ్రమయతు భువనే పిండికా వః ప్రశస్తిమ్ ॥

గుండ్రంగా ఉండే సుదర్శనుని నాభి చక్రజ్వాలలనే నదిలోని సుడివలె ఉన్నదని ఇందులో స్తుతింపబడుతున్నది.

సుదర్శనుని జ్వాలలే ఒక నది. నదులన్నీ సహజంగా పర్వతాలనుండి ప్రవహించేటట్లే, ఈ జ్వాలానది భగవానుని భుజం అనే ఉన్నతమైన విశాలమైన పర్వతంనుండి ప్రవహిస్తున్నది. నదులు కూలంకషలు. ఒడ్డును ఒరసుకొంటూ ప్రవహించే స్వభావాన్ని, నీటి సమృద్ధిని కల్గి ఉంటాయి. చక్రజ్వాలకూడా దిగంతకూలంకషమైన సమృద్ధిని కల్గి ఉన్నది. నదులు అన్నీ సముద్రాన్ని చేరేటట్లే, ఈ జ్వాలానదికూడా దేవాసురసైన్యం అనే సముద్రాన్ని చేరి, వ్యాపిస్తున్నది. నదులు అలల వరుసలను కల్గి ఉన్నట్లే, జ్వాలనదికూడా అరాలనే అలల వరుసలను కల్గి ఉన్నది. కెఱటాల కదలికవల్ల నది నిమ్నోన్నతంగా ఉండేటట్లే, జ్వాలానదికూడా కాంతికెఱటాల కదలికవల్ల నిమ్నోన్నతంగా ఉన్నది. ఇటువంటి సుదర్శనుని నాభి లోకంలో మీ కీర్తిని వ్యాపింపజేయాలి. మీ పేరును సర్వలోకప్రసిద్ధంగా చేయాలి.

శ్రీసుదర్శననాభి మీకు అడ్డులేని సుఖాన్ని ఇవ్వాలి.

56. పాణౌ కృత్వాఽఽహవాగ్రే ప్రతిభటవిజయోపార్జితాం వీరలక్ష్మీం
ఆనీతాయా స్తతోఽస్యా స్స్వసవిధ మసురద్వేషిణా పూరుషేణ ।
ప్రాసాదం వాసహేతో ర్విరచిత మరుణై రశ్మిభి స్సూచయంతీ
నాభి ర్వో నిర్మిమీతాం రథచరణపతేః నిర్వృతిం నిర్విఘాతామ్ ॥

ఇందులో ఉన్నతమైన శ్రీసుదర్శన నాభి ఒక ప్రాసాదంగా వర్ణింపబడుతున్నది.

శ్రీసుదర్శనపురుషుడు యుద్ధరంగంలో ప్రవేశించి, ప్రత్యర్థులను సంహరించి, జయాన్ని పొంది వీరలక్ష్మి కరగ్రహణాన్ని చేశాడు. ఆమెను తన దగ్గరకు తీసికొని వచ్చి, ఆమె సుఖంగా, ఆనందంగా ఉండడానికి తగిన ఒక ప్రాసాదాన్ని నిర్మించి



ఇచ్చాడు. అదే సుదర్శనుని నాభి. లోకంలో ప్రాసాదాన్ని ఎఱ్ఱని రాళ్ళతో నిర్మించేటట్లే (అరుణైః అశ్మభిః నిర్మితమ్) ఇక్కడ ఈ ప్రాసాదంకూడా "అరుణైః రశ్మిభిః నిర్మితమ్"- ఎఱ్ఱని కాంతులతో నిర్మితం. ఇటువంటి, వీరలక్ష్మితో వెలిగే సుదర్శనుని నాభి మీకు అడ్డులేని ఆనందాన్ని కల్గించాలి.

శ్రీసుదర్శన నాభి మీ కర్మలను నశింపజేయాలి.

57. డిండీరాపాండుగండై రరియువతిముఖైః పిండికా కృష్ణహేతేః
ఉచ్చండాశ్రుప్రవర్షై రుపరతతిలకై రుక్తశౌండీర్యచర్యా ।
ద్విత్రగ్రామాధిపత్యద్రుహిణమదమషీదూషితాక్షక్షమాభృత్-
సేవాహేవాకపాకం శమయతు భవతాం కర్మ శర్మప్రతీపమ్ ॥

నురుగువలె అంతటా తెల్లగా పాలిపోయినవి, అధికంగా అశ్రువర్షాన్ని కల్గినవి, తిలకమనే ఆభరణాన్ని లేనివి అయిన శత్రురాజుల భార్యల ముఖాలు శ్రీసుదర్శనుని నాభియొక్క వీర చరిత్రలను వ్యాఖ్యానిస్తున్నాయి. ఇటువంటి నాభి, ఏవో రెండు మూడు గ్రామాలకు మాత్రం అధిపతులు అయినంతమాత్రంతో బ్రహ్మాండాధిపతి అయిన బ్రహ్మకు ఉండే గర్వంవంటి గర్వాన్ని కల ఇంద్రియాలను కల ప్రభువులను సేవించాలనే ఆశను కల్గి ఉండే దుర్బుద్ధి మీకు లేకుండా ఉండేటట్లు చేయాలి.

శ్రీసుదర్శన నాభి మీకు కుబేరసంపదకు మించిన సంపదను ఇవ్వాలి.

58. పర్యాప్తా మున్నతిం యా ప్రథయతి కమలం యా తిరోభావ్య భాతి
స్రష్టుః సృష్టే ర్ద్వీయః కువలయమహితం యా బిభర్తి స్వరూపమ్ ।
భూమ్నా స్వేనాంతరిక్షం కబలయతి చ యా సా విచిత్రా విధత్తాం
దైతేయారాతినాభిః ద్రవిణపతిపదద్వేషిణీం సంపదం వః ॥

చక్రనాభి పరిపూర్ణం అయిన ఔన్నత్యాన్ని కల్గినది. తామరపూవును మించి శోభిస్తున్నది. బ్రహ్మసృష్టి కంటే మించి ఉన్నది. భూమండలంలో పూజనీయం అయిన స్వరూపాన్ని ధరించి ఉన్నది. తన గొప్పతనంతో అంతరిక్షాన్ని కబళీకరిస్తున్నది. అటువంటి విచిత్రమైన చక్రనాభి మీకు కుబేరుని సంపదకు మించిన సంపదను అనుగ్రహించాలి.

(ఈ శ్లోకంలో భగవానుని నాభికంటే చక్రనాభికి ఆధిక్యాన్ని సూచించే పదాల ప్రయోగంలోని అందం సహృదయహృదయావర్జకం. భగవానుని నాభి లోతుగా కిందకు ఉంటే, చక్రనాభి ఉన్నతంగా ఉన్నదని, భగవానుని నాభి కమలాన్ని ఊర్ధ్వదిశగా కల్గి

ఉంటే, చక్రనాభి కమలాన్ని అధఃకరిస్తున్నదని, భగవానుని నాభి బ్రహ్మను సృష్టిస్తే, చక్రనాభి బ్రహ్మసృష్టికి దూరం అని, భగవానుని నాభివల్ల అంతరిక్షం పుట్టగా, చక్రనాభి అంతరిక్షాన్ని కబళీకరిస్తున్నదని- ఈ విధంగా పలు రీతుల్లో భగవానుని నాభికంటే చక్రనాభికి కల ఆధిక్యం శ్లోకంలో వ్యంగ్యమర్యాదయా సూచింపబడింది.)

శ్రీసుదర్శన నాభి మీ భగవచ్ఛేషత్వాన్ని రక్షించాలి.

59. వాణీవాంగ్రై శ్చతుర్భిః సదసి సుమనసాం ద్యోతమానస్వరూపా
బాహ్వంతస్థా మురారే రభిమత మఖిలం శ్రీరివ స్పర్శయంతీ ।
దుర్గేవోగ్రాకృతి ర్యా త్రిభువనజననస్థేమసంహారధుర్యా
మర్యాదాలంఘనం వః క్షపయతు మహతీ హేతివర్యస్య నాభిః ॥

ఇందులో చక్రనాభికి సరస్వతి- లక్ష్మి-దుర్గా అనే త్రిమూర్తుల పత్నులతో సాధర్మ్యం చమత్కారపూర్వకంగా ప్రతిపాదింపబడుతున్నది.

సరస్వతీదేవి పరా-పశ్యంతీ-మధ్యమా-వైఖరీ- అనే నాల్గు అంగాలను కల్గి ఉన్నట్లే చక్రనాభికూడా జ్వాల, నేమి, అరం, అక్షం- అనే నాల్గు మిగిలిన చక్రావయవాలను కల్గి ఉంటుంది. లక్ష్మీదేవి భగవానుని వక్షఃస్థలంలో నిత్యవాసం చేస్తూ, భక్తులకు సర్వాభీష్టాలను ప్రసాదిస్తుంది. చక్రనాభికూడా భగవానుని బాహువుల చివరలో ఉంటూ భక్తుల మనోభీష్టాలను సాధించి ఇస్తుంది. దుర్గాదేవి ఉగ్రమైన ఆకారాన్ని కల్గి ఉన్నట్లే, సుదర్శననేమికూడా భయంకరమైన ఆకారాన్ని కల్గి ఉన్నది. త్రిమూర్తులు నిర్వహించే సృష్టి-స్థితి-లయాలనే కార్యాలలో వారి పత్నులకును పతి-పత్నీన్యాయంద్వారా అన్వయం ఉన్నది. అదేరీతిలో చక్రనాభికూడా సృష్ట్యాది కార్యత్రయాన్ని నిర్వహించగల సామర్థ్యాన్ని కల్గినది. ఇటువంటి చక్రనాభి మీ శేషత్వమర్యాద నశించకుండా ఉండేటట్లు కటాక్షించాలి. స్వస్వాతంత్ర్య నివృత్తిని కలుగజేయాలి.

శ్రీసుదర్శననాభి మీ అమంగళాలను తొలగించాలి.

60. స్రగ్భి స్సంతానజాభిః మధురమధురసస్యందసందోహినీభిః
పాటీరైః ప్రౌఢచంద్రాతపచయ సుషమాలోపనైః లేపనై శ్చ ।
ధూపైః కాలాగరూణా మపి సురసుదృశో విస్ర మర్చాసు యస్యాః
గన్ధం రుంధంతి సా వ శ్చిర మసురభిదో నాభి రవ్యా దభవ్యాత్ ॥

దేవకాంతలు తమ ఆరాధనలో కల్పవృక్షాలు పూచిన, తీయని మకరందాన్ని ప్రవహించే పూలతో కూర్చిన మాలెలలో, పూర్ణచంద్రుని వెన్నెలకంటే చల్లని చందనపు



లేపనాలతో, నల్లని అగరుతో వేసిన ధూపాలతో చక్రనాభికి శత్రుశరీరాల మాంసం, రక్తం మొదలైన వానివల్ల కల్గిన దుర్గంధాన్ని పోగొడుతున్నారు. అటువంటి సుదర్శనుని నాభి మీకు అమంగళం కలుగకుండా రక్షించాలి.

శ్రీసుదర్శననాభి మీకు నేత్రానందాన్ని కల్గించాలి.

61. అంహ స్సంహత్య దగ్ధ్వా ప్రతిజనిజనితం ప్రౌఢసంసారవన్యా-
దూరాధ్వన్యా నధన్యాన్ మహతి వినతిభి ర్ధామని స్థాపయంతీ ।
విశ్రాన్తిం శాశ్వతీం యా నయతి రమయతాం చక్రరాజస్య నాభిః
సంయన్నోమముహ్యమానత్రిదశరిపుదశాసాక్షిణీ సాఽక్షిణీ వః ॥

**"సంసారమరుకాంతారే"** అనే రీతిలో సంసారమరుకాంతారంలో చిరకాలం చాలా దూరం ప్రయణించి, ఎన్నో క్రూరకర్మలను చేసిన పాపిష్ఠివారిని చక్రనేమి కాపాడి, వారు వారు ఆయా జన్మలలో చేసిన పాపాలను అన్నిటినీ నిశ్శేషంగా దహించి, గొప్పదైన పరమపదానికి తీసికొనిపోయి, నిలుపుతున్నది, ఏనాటికీ చెడని మోక్షానందాన్ని కల్గిస్తున్నది. ఈ చక్రనేమి దేవతలకు శత్రువులైన అసురులు యుద్ధరంగంలో పొందే దురవస్థకు సాక్షీభూతంగా ఉన్నది. ఇటువంటి నేమి మీ నేత్రాలకు ఆనందాన్ని కల్గించాలి.

## అక్షవర్ణనమ్

శ్రీసుదర్శనాక్షం మీ ధనాశను పోగొట్టాలి.

62. శ్రుత్వా యన్నామశబ్దం శ్రుతిపథకటుకం దేవనక్రీడనేషు
స్వర్వైరిస్త్రైరవత్యో భయవివశధియః కాతరన్యస్తశారాః ।
మన్దాక్షం యాంత్యమన్దం ప్రతియువతిముఖైః దర్శితోత్త్రాసదర్పైః
అక్షం సౌదర్శనం తత్ క్షపయతు భవతా మేధమానాం ధనాయామ్ ॥

ఈ శ్లోకంనుండి 74వ శ్లోకంవరకు వరుసగా 13 శ్లోకాలలో సుదర్శనుని అక్షవర్ణన చేయబడుతున్నది. సుదర్శనచక్రం మధ్యలో సుడివలె ఉండే స్థానవిశేషమే ఈ అక్షం. అక్షమనే పదానికి సంస్కృతంలో జూదంలోని పాచికలనే అర్థంకూడా ఉన్నందున, ఆ అర్థాన్ని చమత్కారకరంగా ప్రయోగిస్తూ ఈ శ్లోకం రచింపబడింది.

ఒకానొక సమయంలో అసురకాంతలు దేవకాంతలతో కలసి అక్షక్రీడను (జూదాన్ని) ఆడారు. అపుడు ప్రసంగవశాత్తు జూదంలోని సాధనం అయిన పాచికలనే అర్థాన్ని ఇచ్చే అక్షమనే పదం దేవకాంతలచే ఉచ్చరింపబడింది. ఈ పదం సుదర్శనుని అవయవ విశేషాన్నికూడా చెబుతుంది కనుక, అసుర కాంతలు ఆ అర్థాన్ని గ్రహించి,

సుదర్శనాక్షప్రస్తావన వచ్చిందని తలచి, ఇతఃపూర్వమే సుదర్శనుని అక్షం యొక్క కాఠిన్యాన్ని పలు మార్లు వారు అనుభవించినవారు కావడంవల్ల, దానివల్లనే వారికి వైధవ్యం ప్రాప్తించినందువల్ల, "ఇంకా మనలకు బాధించడానికిగా సుదర్శనుని అక్షం వచ్చింది కాబోలు !" అని చాలా భయాన్ని పొందారు. వారి శరీరం కంపించింది. మఱుక్షణమే వారు పాచికలు దూరంగా పారవేసి పాఱిపోయారు. దేవకాంతలు దీనినంతాగమనించి వారిని హేళన చేశారు. అపుడు అసురస్త్రీలు సిగ్గుతో తలదించుకొన్నారు. ఇటువంటి మహిమను కల సుదర్శనుని అక్షం మీ ధనవ్యామోహాన్ని నశింపజేయాలి.

శ్రీసుదర్శనాక్షం మీ శత్రువులను నశింపజేయాలి.

63. వ్యస్తస్కంధం విశీర్ణప్రసవపరికరం ప్రత్తపత్రోపమర్దం
సంయద్వర్షాసు తర్షాతురఖగపరిషత్పీతరక్తోదకాసు ।
అక్షం రక్షస్తరూణా మశనివ దశనై రాపతన్మూర్ధ్ని మూర్ధ్ని
స్తా దస్త్రాధీశితు ర్వః స్తబకితయశసో ద్వేషిణాం ప్లోషణాయ ॥

ఇందులో చక్రాక్షం పిడుగుగా రూపణం చేయబడుతున్నది. పిడుగు వర్షాకాలంలో చెట్లపై పడి, వాటిపై ఉండే గెలలను కూలగొట్టి, పూలను, పండ్లను చెల్లాచెదఱు చేసి, ఆకులను నశింపజేసి - ఈ విధంగా పలు రీతులలో ధ్వంసం చేస్తుంది. అదే రీతిలో చక్రాక్షంకూడా చేస్తున్నదని తెలుపబడుతున్నది.

రాక్షసులు, అసురులు పెద్దపెద్ద వృక్షాలవంటివారు. వారి శిరస్సులపై చక్రాక్షం అనే పిడుగు మహావేగంతో వచ్చి పడుతున్నది. పిడుగు చెట్ల కొమ్మలను, కాండాలను బద్దలుచేస్తుంది. చక్రాక్షం అనే పిడుగు అసురుల, రాక్షసుల తోలుపట్టలను తెగగొడుతూ వారి మీద పడుతున్నది. (స్కంధం అంటే వృక్షశాఖ, కాండం, తోలుపట్ట- అని అర్థాలు) పిడుగు చెట్లపూలను, ఫల సమూహాలు చెల్లాచెదఱుగా అయేటట్లు చేస్తుంది. అక్షం రాక్షసుల సంతతిని, పరిజనాన్ని నశింపచేస్తుంది. (ప్రసవమంటే పూలు, పళ్ళు- అని, సంతానం, పరిజనం అని అర్థం) పిడుగు చెట్ల ఆకులను పాడుచేస్తుంది. చక్రాక్షం రాక్షసుల రథగజతురగాది వాహనాలను మర్దిస్తుంది. (పత్రశబ్దానికి ఆకులు అని, వాహనం అని అర్థం.) పిడుగు వర్షాకాలంలో పడుతుంది. అందువల్ల యుద్ధం వర్షాకాలంగా రూపింపబడుతున్నది. వర్షాకాలంలో దాహంతో బాధింపబడ్డ పక్షులు ఎఱ్ఱని నీటిని (కొత్త నీరు కనుక వానకాలంలోని నీరు ఎఱ్ఱగా ఉంటుంది) పానం చేస్తాయి. అదేవిధంగా యుద్ధంలో అసురవీరుల ఎఱ్ఱని రక్తాన్ని దేవతల బాణసమూహం



పానం చేస్తున్నది. ఈ విధంగా అసురవర్గాన్ని నాశనం చేస్తూ వారిపై వేగంగా పడే మహాయశస్వి అయిన పిడుగువంటి చక్రాక్షం మీ శత్రువులను దహించాలి.

శ్రీసుదర్శనాక్షం మీకు దేవలోక సంపదవంటి సంపదను ఇవ్వాలి.

64. దీక్షాం సంగ్రామసత్రే మహతి కృతవతో దీప్తిభి స్సంహతాభిః
జిహ్వాలే సప్తజిహ్వే దనుజకులహవి ర్జుహ్వతో నేమిజుహ్వా ।
వైకుణ్ఠాస్త్రస్య కుండం మహ దివ విలసత్పిండికావేదిమధ్యే
దిశ్యా ద్దివ్యర్ధిదేశ్యం పద మిహ భవతా మక్షతోన్మేష మక్షమ్ ॥

శ్రీసుదర్శనుని దీక్షితునిగా, యుద్ధాన్ని ఒక యజ్ఞంగా, చక్రనాభిని యాగవేదికగా, చక్రనేమిని హోమసాధనం అయిన దర్విగా, అసురకులాన్ని హవిస్సుగా, అక్షాన్ని హోమకుండంగా వర్ణించడం ఇందులోని విషయం.

మహాసత్రమనబడే యుద్ధరంగంలో సుదర్శనుడు దీక్షితుడు. దీక్షితుడు అగ్నిలో హవిస్సును సమర్పించేటట్లే, ఇతడుకూడా తనలో ఉండే అగ్నిలో అసురవీరులనే హవిస్సును హోమం చేస్తున్నాడు. ఈ హోమంలో చక్రనేమి హోమసాధనం అయిన దర్వి. అక్షం హోమకుండం. విశేషమేమంటే లోకంలోని హోమకుండం హోమం ముగిసిన తరువాత ప్రకాశం తగ్గి మసిబారిపోతుంది. కాని, ఈ అక్షమనే హోమకుండం మాత్రం అక్షతోన్మేషం- ఏనాటికీ తరగని ప్రకాశాన్ని కల్గినది. ఇటువంటి అక్షం మీకు దేవలోకసంపదతో సాటి వచ్చే సంపదను ఇవ్వాలి.

శ్రీసుదర్శనాక్షం మీ శత్రునాశనాన్ని చేయాలి.

65. తుంగా ద్దోరద్రిశృంగాత్ దనుజవిజయినః స్పష్టదానోద్యమానాం
శత్రుస్తంబేరమాణాం శిరసి నిపతతః ప్రస్తముక్తాస్థిపుంజే ।
రక్తై రభ్యక్తమూర్తే ర్విదలనగలితైః వ్యక్తవీరాయితర్ద్ధేః
హర్యక్షస్యారిభంగం జనయతు జగతా మీడితం క్రీడితం వః ॥

హర్యక్షశబ్దానికి సభంగ, అభంగశ్లేష ద్వారా అర్థాన్ని నిర్వహిస్తూ చక్రాక్షానికి సింహసామ్యం వర్ణింపబడుతున్నది. సంస్కృతంలో హర్యక్షమంటే అభంగపదమైనపుడు సింహం అని, సభంగమైతే, భగవదవతారరూపుడు కనుక హరిశబ్దవాచ్యుడైన సుదర్శనుని అక్షమని అర్థం.

సింహం గొప్ప గొప్ప పర్వత శిఖరాలనుండి ఏనుగు తలలపై దుముకుతుంది. వాటి కుంభస్థలాలలోని ముత్యాలను చెల్లాచెదఱు చేస్తుంది. ఏనుగుల రక్తంతో తడిసి ముద్ద అవుతుంది. ఈ విధంగా తన వీరకృత్యాలను వ్యక్తం చేస్తుంది. సుదర్శనాక్షం

అనే సింహంకూడా భగవానుని ఉన్నతమైన భుజశిఖరాలనుండి రాక్షసులనే ఏనుగులపై దూకుతుంది. ఏనుగుల గండస్థలాలనుండి దానజలం స్రవిస్తుంది. కావున అవి స్పష్టదానోద్యమాలు. చక్రాక్షంకూడా అటువంటిదే. అంటే- స్పష్టమైన రాక్షసుల ఖండనోద్యమాన్ని కల్గినది. చక్రాక్షం రాక్షసవీరులను ఖండిస్తున్నదని భావం. (దానమంటే దానజలం అని, ఖండనమని అర్థం). సింహం ఏనుగుల తలలపై దూకి, వాటి కుంభస్థలాలను చీల్చి అందులోని ముత్యాలను చిందేటట్లుగా చేసేటట్లే, చక్రాక్షం అనే సింహం రాక్షసవీరులపై దూకి, వారి ఎముకల తునకలు చిందింపచేస్తుంది. ఇటువంటి, లోకం అంతా పొగడే వీరకృత్యాలను కల హర్యక్షం మీ శత్రువులను నశింపజేయాలి.

శ్రీసుదర్శనాక్షం మీకు శాశ్వతమైన కీర్తిని కల్గించాలి.

**66.** ఉన్మీలత్పద్మరాగం కటక మివ ధృతం బాహునా యన్మురారేః
దీప్తాన్ రశ్మీన్ దధానం నయన మివ యదుత్తారకం విష్టపస్య ।
చక్రేశార్క స్య యద్వా పరిధి రభిదధత్ దైత్యహత్యా మివ ద్రాక్
అక్షం పక్షే పతిత్వా పరిఘటయతు వ స్తద్ధఢిష్ఠాం ప్రతిష్ఠామ్ ॥

ఇందులో ఒక్కొక్క పాదంలో ఒక్కొక్క రీతిలో చక్రాక్షం ఉత్ప్రేక్షింప బడుతున్నది. సుదర్శనుని అక్షం జ్వలించే కిరణాలను కల్గి ఉన్నది. ఆ అక్షాన్ని చూస్తే భగవానుడు తన బాహువులో అలంకరించుకొన్న, పద్మరాగమణులు పొదిగిన భుజవలయంవలె ఉన్నది. (భుజవలయం పద్మరాగమణులతో ఎట్టి కాంతిని కల్గి ఉన్నట్లే, చక్రాక్షం పద్మరాగ మణులఎట్టి కాంతివంటి కాంతిని కల్గి ఉన్నది) లోకానికి అంతటికీ అద్వితీయనేత్రంవలె ఉత్తారకంగా (వ్యక్తమైన నల్లగుడ్డును కల్గినదిగా, లోకోజ్జీవకంగా) ఉన్నది. సూర్యుని చుట్టూ ఏర్పడే వలయానికి పరివేషం అని పేరు. ఇది లోకశుభసూచకం. అక్షాన్ని చూచి సుదర్శనమనే సూర్యునిచుట్టూ ఏర్పడ్డ, సమీపకాలంలో సంభవించే దైత్యుల అరిష్టాన్ని సూచించే శకునం అయిన సూర్యపరివేషంవలె ఉన్నది. ఇటువంటి చక్రాక్షం మీకు యావదాత్మభావి అయిన ఔన్నత్యాన్ని అనుగ్రహించాలి.

శ్రీసుదర్శనాక్షం మీకు గొప్పబుద్ధిని ఇవ్వాలి.

**67.** క్రీడత్ప్రాక్రోడదంష్ట్రాహతిదలితహిరణ్యాక్షవక్షఃకవాట-
ప్రాదుర్భూతప్రభూతక్షతజసముదితారుణ్యముద్రం సముద్రమ్ ।
ఉన్మీలత్కింశుకాభై రుపహస దమితై రంశుభి స్సంశయఘ్నం
అక్షం చక్రస్య దత్తా మఘశతశమనం దాశుషీం శేముషీం వః ॥



ఇందులో చక్రాక్షం సముద్రంగా వర్ణింపబడుతున్నది. వరాహావతార వృత్తాంతాన్ని పురస్కరించుకొని ఈ శ్లోకం రచింపబడింది.

మహావరాహమూర్తిగా అవతరించిన విష్ణువు, భూమిని చాపగా చుట్టి సముద్రంలో దాగిన హిరణ్యాక్షుని విశాలమైన వక్షస్సును తన కోరదంతంతో గుచ్చినపుడు, ఆ వక్షంనుండి అమితంగా రక్తం ప్రవహించింది. ఆ రక్తప్రవాహం సముద్రంలో అంతటా వ్యాపించి, సముద్రం అంతా రక్తవర్ణం అయింది. ఇటువంటి ఎఱ్ఱని సముద్రాన్ని వికసించిన మోదుగుపూల ఎఱ్ఱని కాంతివంటి కాంతిని కల సుదర్శనాక్షం "నా రంగు ముందు నీ రంగు ఏమీ గొప్ప కాదులే" అని పరిహసిస్తున్నట్లున్నది. ఇటువంటి అక్షం మీ వందల కొలది పాపాలను భగవద్విషయావగాహం కల్గించడం ద్వారా పోగొట్టేది, ఆ భగవానుని స్వరూపరూపగుణ విభూతులనుగూర్చిన సంశయాలను అన్నిటినీ పోగొట్టేది అయిన గొప్ప బుద్ధిని ఇవ్వాలి.

శ్రీసుదర్శనాక్షం మిమ్ములను రక్షించాలి.

**68.** పద్మోల్లాసప్రదం య జ్జనయతి జగతీ మేధమానప్రబోధాం
యస్య చ్ఛాయాసమానా లసతి పరిసరే రోహిణీ తారకాగ్ర్యా ।
నానాహేత్వున్నతత్వం ప్రకటయతి చ యత్ ప్రాప్తకృష్ణప్రయాణం
త్రేధా భిన్నస్య ధామ్న స్సముదయ ఇవ తత్పాతు వ శ్చాక్ర మక్షమ్ ॥

ఇందులో, సూర్య-చంద్ర-అగ్ని రూపంలోని లోకంలో గల ఉత్తమతేజః పదార్థాలు మూడిటియొక్క కలయికగా చక్రాక్షం భాసిస్తున్నదనే అంశం చమత్కారపూర్వకంగా ప్రతిపాదింపబడుతున్నది. "సోమసూర్యదహనప్రభోజ్జ్వలమ్ చక్ర మేత దుదితమ్' అని అహిర్బుధ్న్యసంహితాసూక్తి ఇక్కడ స్మరణీయం.

చక్రాక్షం సూర్యుని తేజస్సువలె ఉన్నది. సూర్యుని తేజస్సు పద్మాలకు ఆనందాన్ని కల్గిస్తుంది. సుదర్శనాక్షం కూడా పద్మాశబ్దంచేత నిర్దేశింపబడే లక్ష్మీదేవికి దుష్టశిక్షణ శిష్టరక్షణ-భగవత్కైంకర్యాలద్వారా ఆనందాన్ని కల్గిస్తుంది. అట్లే, సూర్యుని తేజస్సు లోకానికి ప్రబోధాన్ని కల్గిస్తుంది. సుదర్శనాక్షం లోకానికి వృద్ధి చెందే జ్ఞానాన్ని కల్గిస్తుంది. ఈ రీతుల్లో చక్రాక్షం సూర్యతేజస్సుతో సాధర్మ్యాన్ని కల్గి ఉన్నది. చక్రాక్షం చంద్రుని తేజస్సువలె ఉన్నది. చంద్రుని నక్షత్రాలలో గొప్పదైన రోహిణీనక్షత్రం వెన్నంటి ఉంటుంది. చక్రాక్షం ఎఱ్ఱదనాన్ని కల్గి ఉండడంలో రోహిణిని మించి ఉంటుంది- అని ఇంకొక అర్థం.) చక్రాక్షం మధ్యలో ప్రణవం, ఈ ప్రణవం మధ్యలో ఎఱ్ఱని సుదర్శన పురుషుడు- అనే క్రమం అహిర్బుధ్న్యసంహితలో తెలుపబడింది. దీనినిబట్టి, ప్రణవసంబంధంచేత

శ్రేష్ఠమై, ఎఱ్ఱనిదై, సాటి లేని కాంతి చక్రాక్షం పరిసరంలో ప్రకాశిస్తుంది- అని తెలుస్తున్నది. చక్రాక్షం అగ్ని తేజస్సువంటిది. అగ్నితేజస్సు పలు జ్వాలా సమూహాలను కల్గి ఉంటుంది. ధూమాన్ని మార్గంగా కల్గి ఉంటుంది. చక్రాక్షం పలు ఆయుధాలకంటే గొప్పది. కృష్ణశబ్దవాచ్యుడైన భగవానుని మార్గాన్ని అనుసరిస్తుంది. ఇటువంటి రీతిలో సూర్య-చంద్ర- అగ్ని తేజస్సులలో సాధర్మ్యాన్ని కల సుదర్శనాక్షం మీకు రక్షణను కల్గించాలి.

శ్రీసుదర్శనాక్షం మిమ్ములను కాపాడాలి.

69. శోచిర్భిః పద్మరాగద్రవసమసుషమైః శోభమానావకాశం
ప్రత్యగ్రాశోకరాగప్రతిభటవపుషా భూషితం పూరుషేణ ।
అన్తః స్వచ్ఛంధమగ్నోత్థితభృగుతనయం క్షత్రియాణాం హతానామ్
ఆరబ్ధం శోణితౌఘైః సర ఇవ భవతో దివ్యహేత్యక్ష మవ్యాత్ ॥

భగవానుడు ఎత్తిన అవతారాలలో పరశురామావతారం ఒకటి. దీనిని పురస్కరించుకొని ఈ శ్లోకం రచింపబడింది. ఇందులో రక్తతటాకంతో చక్రాక్షాన్ని పోల్చడం విషయం.

ఇరవైఒక్క పర్యాయాలు భూమిలో అంతటా పర్యటించి, దుష్టక్షత్రియ నిబర్హణాన్ని చేసి, వారి రక్తంతో కూడిన తటాకంలో పరశురాముడు స్నానం చేసి, పితృదేవతలకు తర్పణం చేశాడనే పౌరాణికగాథ ఇక్కడ స్మరణీయం. పద్మరాగమణుల కాంతివంటి కాంతిని కల్గిన, కిరణాలతో వెలిగే స్వస్థానాన్ని కల, అపుడే వికసించిన అశోకపుష్పాల శోభవలె ఎఱ్ఱని కాంతిని కల శరీరాన్ని కల్గిన శ్రీసుదర్శనపురుషుడు అక్షం మధ్యలో ప్రకాశించడాన్ని చూస్తే, రక్త తటాకంలో స్నానం చేసి, పైకి లేచిన పరశురాముడా ఇతడు! అన్నట్లున్నాడు. అటువంటి సుదర్శనాక్షం మిమ్ములను రక్షించాలి.

శ్రీసుదర్శనాక్షం మీకు నిశితమైన బుద్ధిని ఇవ్వాలి.

70. మత్తానా మింద్రియాణాం కృతవిషయమహాకాననక్రీడనానాం
సృష్టం చక్రేశ్వరేణ గ్రహణధిషణయా వారివద్వారణానామ్ ।
గంభీరం యంత్రగర్తం కమపి కృతధియో మన్వతే యత్ప్రదేయాత్
అస్థూలాం సంవిదం వః త్రిజగదభిమతస్థూలలక్షం తదక్షమ్ ॥

మదించిన గజాలను బంధించడంకోసం చక్రవర్తులు లోతైన గోతిని తవ్విస్తారు. దానికి "వారీ" అని పేరు. అటువంటి గోయి వలె చక్రాక్షం కన్పడుతున్నది.



విషయాంతరాలనే మహారణ్యాలలో మదించిన ఏనుగులవలె స్వైరంగా సంచరించే భక్తుల ఇంద్రియాలను వాటిని పట్టుకోవడంకోసం శ్రీసుదర్శనుడు తవ్వించిన వారి వలె సుదర్శనాక్షం ఉన్నది. అటువంటి, మీ అభిమతార్థాలను సిద్ధింపజేసే చక్రాక్షం అత్యంతసూక్ష్మమైన బుద్ధిని మీకు అనుగ్రహించాలి.

శ్రీసుదర్శనాక్షం మీకు కామితార్థప్రదాయకం కావాలి.

71. ప్రాణాదీన్ సన్నియమ్య ప్రణిహితమనసాం యోగినా మంతరంగే
తుంగం సంకోచ్యరూపం విరచితదహరాకాశకృచ్ఛ్రాసికేన ।
ప్రాప్తం యత్ పూరుషేణ స్వమహిమసదృశం ధామ కామప్రదం వః
భూయాత్ తత్ భూర్భువస్స్వః త్రయవరివసితం పుష్కరాక్షాయుధాక్షమ్ ॥

ఇందులో చక్రాక్షమహిమ వర్ణింపబడుతున్నది. ప్రాణాది వాయువులను అణచి ఉంచి, సమాధిలో చిత్తాన్ని నిలిపిన యోగుల హృదయంలో అత్యంతసూక్ష్మం అయిన దహరాకాశం ఉంటుంది. అందులో శ్రీసుదర్శనమూర్తి వేంచేసి ఉన్నపుడు తన విభురూపంతో వేంచేసి ఉండడం వీలయే పని కాదు కనుక, తన పెద్ద రూపాన్ని సంకోచింప చేసికొని, మిక్కిలి శ్రమతో ఆ దహరాకాశంలో వేంచేసి ఉండవలసి ఉంటుంది. ఆ విధంగా ఎంతో శ్రమతో చిన్నరూపంతో వేంచేసి ఉండే శ్రీసుదర్శనునకు తన గొప్పతనానికి తగినట్లుగా యథేచ్ఛంగా వేంచేసి ఉండడానికి ఆవశ్యకం అయిన, విశాలమైన చక్రాక్షమనే గొప్ప స్థానం దొరికింది. అటువంటి చక్రాక్షం మీ సర్వాభీప్సితాలను నెరవేర్చాలి.

శ్రీసుదర్శనాక్షం మిమ్ములను రక్షించాలి

72. విద్ధాన్ వీధ్రేణ ధామ్నా చరణనఖభువా బద్ధవాసస్య మధ్యే
చక్రాధ్యక్షస్య బిభ్రత్ పరిహసితజపాపుష్పకోశాన్ ప్రకాశాన్ ।
శుభ్రై రభ్రై రదభ్రైః శరది తత ఇతో వ్యోమ విభ్రాజమానం
ప్రాత స్తాదిత్యరోచి స్తత మివ భవతః పాతు రథాంగ మక్షమ్ ॥

చక్రాక్షానికి, శరత్కాలంలో సూర్యోదయసమయంలోని ఆకాశానికి కల సామ్యం ఇందులో ప్రతిపాదింపబడుతున్నది.

తెల్లని మేఘబృందంతో ప్రకాశిస్తూ, కొన్నిచోట్ల శుభ్రమైన కాంతిని కల్గితెల్లగా, ఉదయకాలపు సూర్యుని ఎఱ్ఱని కాంతులు వ్యాపించగా కొన్ని చోట్ల ఎఱ్ఱగా సంధ్యా కాలికమైన ఆకాశం ఉంటుంది. చక్రాక్షంకూడా అటువంటిదే. ఏవిధంగా అంటే- తనలో అధిష్ఠించి ఉండే సుదర్శనపురుషుని చరణాలలోని నఖాలనుండి పైకి ఎగసిన తెల్లని

కాంతులు,జపాకుసుమవర్ణాన్ని పోలిన సుదర్శనపురుషుని కాంతులు- రెండిటినీ కల చక్రాక్షాన్ని చూడగా శరత్కాలంలో సంధ్యాకాలంలోని ఆకాశంవలె గోచరిస్తున్నది. అటువంటి అక్షం మిమ్మలను కాపాడాలి.

శ్రీసుదర్శనాక్షం మీకు గొప్ప ఆధిపత్యాన్ని ఇవ్వాలి.

**73.** **శ్రీవాణీవాఙ్మృడాన్యో విదధతి భజనం శక్తయో యస్య దిక్షు**
**ప్రాహ వ్యూహం యదాద్యం ప్రథమ మపి గుణం భారతీ పాంచరాత్రీ ।**
**ఘోరాం శాంతాం చ మూర్తిం ప్రథయతి పురుషః ప్రాక్తనః ప్రార్థనాభిః**
**భక్తానాం యస్య మధ్యే దిశతు తదనఘా మక్ష మధ్యక్షతాం వః ॥**

వాసుదేవ- సంకర్షణ - ప్రద్యుమ్న- అనిరుద్ధ రూపాలను కల భగవానుని స్థితి అహిర్బుధ్న్యసంహిత- మొదలైన ఆగమగ్రంథాలలో శ్రీసుదర్శనాత్మకంగా **"వాసుదేవాదికం చక్రం వ్యూహం ప్రాథమికం విదుః, ఉభయో రపి తాదాత్మ్యం బ్రహ్మసంకల్పభావతః"** ఇత్యాదిగా తెలుపబడినందున, ఆ క్రమాన్ని అనుసరిస్తూ ఈశ్లోకం రచింపబడింది. ప్రస్తుతశ్లోకం చక్రావయవం అయిన అక్షానికి సంబంధించినదే అయినా, అవయవ- అవయవిల మధ్య అభేదభావనతో (అక్షం సుదర్శనపురుషుడనే భావనతో) రచింపబడింది- అని చెప్పాలి.

**"జ్ఞానశక్తిబలైశ్వర్య"** -ఇత్యాదిగా చెప్పబడ్డ భగశ్ఛబ్దవాచ్యాలైన ఆఱు గుణాలలో మొదటి గుణం జ్ఞానమే చక్రాక్షమని పాంచరాత్రవాఙ్మయం పేర్కొంది. వాసుదేవాది చతుర్వ్యూహమూర్తులలో మొదటిది అయిన వాసుదేవవ్యూహమూర్తి చక్రాక్ష మని కూడా ఆ వాఙ్మయం తెలిపింది- వాసుదేవాదిచతుర్వ్యూహమూర్తుల శక్తులుగా పాంచరాత్రశాస్త్రంలో చెప్పబడ్డ శ్రీ-వాణి-వాక్-మృడానీ-అనే నాల్గింటిని తూర్పు మొదలైన నాల్గు దిశలలో నిలిపి వాసుదేవ-సంకర్షణ-ప్రద్యుమ్న- అనిరుద్ధరూపి అయిన సుదర్శన భగవానుడు భజింపబడుతున్నాడు. (దీనికి తగిన పాంచరాత్రప్రమాణాలు అన్వేషణీయాలు). భక్తులు మంగళాశాసనార్థం శ్రీసుదర్శనుని రూపాన్ని సేవించినపుడు అది శాంతంగా దర్శనం ఇస్తుంది. అనష్టనివారణం కోసం ప్రార్థించినపుడు అది శత్రుభీకరంగా ప్రత్యక్షం అవుతుంది. ఇటువంటి సుదర్శనపురుషుని అక్షం మీకు నిరపాయమైన ఆధిపత్యాన్ని అనుగ్రహించాలి.

శ్రీసుదర్శనాక్షం మీ అశాంతిని పోగొట్టాలి.

**74.** **రక్షఃపక్షేణ రక్షత్ క్షత మమరగణం లక్ష్యవైలక్ష్య మాజౌ**
**లక్ష్మీ మక్షీయమాణాం వలమథనభుజే వజ్రశిక్షానపేక్షే ।**



**నిక్షిప్య క్షిప్ర మధ్యక్షయతి జగతి యద్దక్షతాం దివ్యహేతేః**
**అక్షామా మక్షమాం తత్ క్షపయతు భవతా మక్షజిల్లక్షమక్షమ్ ॥**

యుద్ధరంగంలో రాక్షససైన్యంచేత గాయపడి, బాధపడ్డవారు, అపజయంవల్ల సిగ్గుపడేవారైన దేవతలను చక్రాక్షరం రక్షిస్తున్నది. వజ్రాయుధాన్ని ప్రయోగించి ఇంద్రుడు చేయవలసిన జగత్ క్షణకార్యాలను చక్రాక్షం నిర్వహిస్తున్నందున ఇంద్రునకు వజ్రాయుధ ప్రయోగంలో అభ్యాసం ఆవశ్యకం కాకుండా పోయింది. ఆ ఇంద్రునకు తరగని, ఏ నాటికీ నశించని ఐశ్వర్యాన్ని సంపాదించి ఇస్తూ, తన సామర్థ్యాన్ని లోకంలో చక్రాక్షం చాటుకుంటున్నది. ఈ అక్షాన్ని జితేంద్రియులైన యోగులు తమ ఆరాధనకు లక్ష్యంగా చేసికొంటున్నారు. ఇటువంటి సుదర్శనాక్షం మీకు తరగకుండా వృద్ధి చెందే దుర్గుణం అయిన అసూయను పోగొట్టాలి. (ఈశ్లోకంలోని అనుప్రాసాలంకారం పఠితలకు శ్రవణసుభగత్వాన్ని సంపాదిస్తున్నది.)

## పురుషవర్ణనమ్

శ్రీసుదర్శన పురుషుడు మీకు పరాక్రమాన్ని ప్రసాదించాలి.

**75.** **జ్యోతిశ్చూడాలమౌళిః త్రిణయనవదనః షోడశోత్తుంగబాహుః**
**ప్రత్యాలీఢేన తిష్ఠన్ ప్రణవశశధరాధారషట్కోణవర్తీ ।**
**నిస్సీమేన స్వధామ్నా నిఖిల మపి జగత్ క్షేమవ న్నిర్మిమాణో**
**భూయాత్ సౌదర్శనో వః ప్రతిభటపరుషః పూరుషః పౌరుషాయ ॥**

ఇంతవరకు జ్వాల, నేమి, అర, నాభి అక్షాలనే అయిదు సుదర్శనాంగాలను వర్ణించిన కవి ఈ శ్లోకం నుండి వరుసగా **26** శ్లోకాలలో అవయవి అయిన శ్రీసుదర్శన పురుషుని వర్ణిస్తున్నారు.

శ్రీసుదర్శనపురుషునివల్ల మీ పరాక్రమం స్థిరంగా నిలవాలి. ఆ సుదర్శన పురుషుడు ఎటువంటి వాడు ? అని అంటే, జ్యోతిఃపుంజాలరూపంలో ఊర్ధ్వాగ్రాలైన జటలను కల్గిన శిరస్సులను కలవాడు. మూడు నేత్రాలను కల ముఖాలను కలవాడు పొడుగైన పదహారు బాహువులను కలవాడు. ప్రత్యాలీఢమనే సన్నివేశంలో ఉండేవాడు- చంద్రమండలంలోని షట్కోణయంత్రంలో వేంచేసి ఉండేవాడు. తన అనవధికం అయిన తేజస్సుతో జగత్తును అంతటినీ రక్షించగల సమర్థుడు. ప్రత్యర్థులైన అసురులకు, రాక్షసులకు చాలా భీకరుడు. ఇటువంటి సుదర్శనపురుషుడు మీ పౌరుషాన్ని రక్షించాలి.

శ్రీసుదర్శనపురుషుడు మీ ఆపదలను అన్నిటినీ తీర్చాలి

76. వాణీ పౌరాణికీయం ప్రథయతి మహితం ప్రేక్షణం కైటభారేః
శక్తి ర్యస్యేషుదంష్ట్రానఖపరశుముఖవ్యాపినీ తద్విభూత్యామ్ ।
కర్తుం యత్తత్త్వబోధో న నిశితమతిభిః నారదాద్యై శ్చ శక్యో
దైవీం వో మానుషీం చ క్షిపతు స విపదం దుస్తరా మస్త్రరాజః ॥

మీకు దేవతలవల్ల, మానవులవల్ల ఏర్పడే ఆపదలనుండి మిమ్ములను సుదర్శనపురుషుడు రక్షించాలి. ఆ సుదర్శనుడు ఎటువంటి వాడు? అని అంటే- పాంచరాత్రాది శాస్త్రాలు భగవానుని సంకల్పరూపశక్తిగా శ్రీసుదర్శనుని తెలుపుతున్నాయి. శ్రీరామావతారంలో బాణాలలో, వరాహావతారంలో దంతంలో, నరసింహావతారంలో గోళ్ళలో, పరశురామావతారంలో గొడ్డలిలో- ఈ రీతిలో ఇంకా పలు అవతారాలలో పలు పలు ఆయుధాలు చేసే కార్యాలను శ్రీసుదర్శనం వాటికి అంతర్యామిగా ఉండి నిర్వహించింది. శ్రీసుదర్శనుని స్వరూపరూపగుణాదులను యథాతథంగా తెలియడానికి కుశాగ్రబుద్ధులైన నారదమహర్షి మొదలైన వారికి సైతం వీలుకాదు.

శ్రీసుదర్శనపురుషుడు మీ కోరికలను తీర్చాలి.

77. రూఢ స్తారాలవాలే రుచిరదలచయః శ్యామలైః శస్త్రజాలైః
జ్వాలాభి స్సప్రవాలః ప్రకటితకుసుమో బద్ధసంఘైః స్ఫులింగైః ।
ప్రాప్తానాం పాదమూలం ప్రకృతిమధురయా చ్ఛాయయా తాపహృద్వః
దత్తా ముద్దోఃప్రకాణ్డః ఫల మభిలషితం విష్ణుసంకల్పవృక్షః ॥

పూర్వశ్లోకంలో భగవత్సంకల్పరూపంగా చెప్పబడ్డ సుదర్శనం ఇందులో ఒక అద్వితీయకల్పవృక్షంగా వర్ణింబపడుతున్నది. ఈ కల్పవృక్షం ప్రణవం అనే పాదులో మొలిచింది. సుదర్శనుని బాహువులలో ఉండే కుంతకృపాణాది నల్లని ఆయుధాలను చూస్తే అవి ఆ సుదర్శనకల్పానికి ఉండే అందమైన ఆకులవలె ఉన్నాయి. (ఆయుధాలు ఇనుముతో చేయబడ్డవి కనుక నల్లగా ఉంటాయి. చెట్ల ఆకులు ముదిరినపుడు ముదురు ఆకుపచ్చరంగులో ఉంటాయి. ఆ రంగు నలుపు రంగుతో ఇంచు మించుగా కలుస్తుంది) ఎఱ్ఱని కాంతులు ఎఱ్ఱని చిగుళ్ళవలె ఉన్నాయి. పుంఖానుపుంఖంగా వెలువరిస్తున్న అగ్నికణాలు ఎఱ్ఱని పూలుగా తోస్తున్నాయి. వృక్షాలు తన మూలం దగ్గరకు వచ్చినవారిని తన చల్లని నీడలో సేదదీర్చి ఆనందింపజేసేటట్లే, సుదర్శనకల్పవృక్షం కూడా తన పాదసమాశ్రయణాన్ని చేసినవారిని సహజమైన, ఆకర్షణీయం అయిన తన కాంతితో వారి సాంసారికతాపాలను తీరుస్తుంది. కల్పవృక్షం



ఎత్తైన, నలు ప్రక్కల వ్యాపించిన శాఖలను కల్గి ఉంటుంది. సుదర్శనకల్పం పదహారు ఉన్నతాలైన, ఆయుధాలను కల్గిన బాహువులనే స్కంధాలను కల్గి ఉంటుంది. ఇటువంటి సుదర్శనకల్పవృక్షం మీకు సకలఫలప్రదానాన్ని చేయాలి.

శ్రీసుదర్శన పురుషుడు మీకు తేజస్సును అనుగ్రహించాలి.

78. ధామ్నా మైరమ్మదానాం నిచయ మివ చిరస్థాయినాం ద్వాదశానాం
మార్తాండానాం సమూఢం మహ ఇవ బహులాం రత్నభాసా మివర్ధిమ్ ।
అర్చిస్సంఘాత మేకీకృత మివ శిఖినాం బాడబాగ్రేసరాణామ్
శంకన్తే యస్య రూపం స భవతు భవతాం తేజసే చక్రరాజః ॥

శ్రీసుదర్శనమూర్తిని సేవించిన బుద్ధిశాలురు ఒక్కొక్కరు ఒక్కొక్క రీతిలో తమ బుద్ధివైశద్యానుగుణంగా ఉల్లేఖించిన తీరు ఇందులో తెలుపబడుతున్నది.

చిరకాలం స్థిరంగా ఉండే, అపూర్వాలైన మెఱపుల కాంతుల సమూహమా ? ఇది అని, ద్వాదశాదిత్యుల తేజస్సు ఒకటిగా చేరి ఉన్నదా ఏమి ? అని, పద్మరాగ మణుల కాంతిసమూహమా? అని, బడబాగ్నుల తేజఃసమూహం ఈ రీతిలో పోగుపడినదా ఏమి ? అని -ఈ రీతిలో పలు రీతుల్లో బుద్ధిశాలురు ఉల్లేఖించేటట్లుండే ఆ శ్రీసుదర్శనపురుషుడు మీకు తేజస్సును అనుగ్రహించాలి.

శ్రీసుదర్శన పురుషుడు మీకు అంతిమకాలంలో కృపజేయాలి

79. ఉగ్రంపశ్యాక్ష ముద్యత్భ్రుకుటి సముకుటం కుణ్డలి స్పష్టదంష్ట్రం
చండాస్త్రైః బాహుదండైః లసదనలసమక్షౌమలక్ష్యోరుకాణ్డమ్ ।
ప్రత్యాలీఢస్థపాదం ప్రథయతు భవతాం పాలనవ్యగ్ర మగ్రే
చక్రేశో౽ కాలకాలేరితభటవికటాటోపలోపాయ రూపమ్ ॥

భక్తులకు మనోహరంగా దర్శనం ఇచ్చే రూపం ఒకటి, ప్రత్యర్థులకు భీషణంగా తోచే రూపం ఇంకొకటి- ఈ రెండూ సుదర్శన మూర్తికి ఉన్నాయి. వాటిలో శత్రుభీషణ రూపాన్నిగూర్చి ఇందులో ప్రస్తావిస్తున్నారు.

చూడగానే భీతిని కల్గించే భీషణాలైన కన్నులను కల్గినది, పైకి ఎత్తబడ్డ కనుబొమలను కల్గినది, కిరీటాన్ని ధరించినది, కర్ణభూషణాలను కల్గినది, స్పష్టంగా ప్రకాశించే కోఱపళ్ళను కల్గినది, శత్రునిరసనంలో శక్తిని కల, అస్త్రాలను ధరించిన బాహుదండాలను కల్గినది, అగ్నిజ్వాలవలె అతిసుకుమారం అయిన పట్టువస్త్రాన్ని ధరించి ఉండే, ప్రారంభంలో లావుగా, క్రమంగా సన్నంగా ఉండే, బలిష్ఠాలై, మాంసలాలైన

రెండు ఊరువులను కల్గినది, ప్రత్యాలీఢం అనే సన్నివేశంలో ఉన్నది అయిన శత్రుభీషణ రూపంతో సుదర్శనమూర్తి మీ కంటికి ఎదురుగా ప్రత్యక్షమై, యమభటుల ఆర్భాటాలను నిర్వీర్యం చేసి, కాపాడాలి.

శ్రీసుదర్శన పురుషుడు మీకు సంపదను ఇవ్వాలి.

**80.** **చక్రం కున్తం కృపాణం పరశుహుతవహౌ వంకుశం దండశక్తీ**
**శంఖం కోదండపాశౌ హలముసలగదావజ్రశూలాంశ్చ హేతీన్ ।**
**దోర్భి స్సవ్యాపసవ్యైః దధదతులబలస్తంభితారాతిదర్పైః**
**వ్యూహ స్తేజో౽భిమానీ నకరవిజయినో జృమ్భతాం సంపదే వః ॥**

ఇంతకుముందు **"చండాస్త్రైః బాహుదండైః"** అని, **"షోడశోత్తుంగబాహుః"** అని పల్కిన అంశాలను ఇందులో కవి వివరిస్తున్నారు. కుడివైపు ఎనిమిది, ఎడమవైపు ఎనిమిది- మొత్తం పదహారు బాహువులలో శ్రీసుదర్శనుడు ఒక్కొక్క బాహువులో ఒక్కొక్క దివ్యాయుధాన్ని ధరించి ఉంటాడు. ఈ పదహారు ఆయుధాలతో ఉండే మూర్తిని శ్రీదేశికులు షోడశాయుధస్తోత్రంలో స్తుతించారు.

చక్రం, ఈటె, కత్తి, గొడ్డలి, శతముఖాగ్ని, కుంతం, దండం, వేలాయుధం - అనే ఎనిమిది ఆయుధాలు కుడివైపున ఉండే ఎనిమిది బాహువులలో,శంఖం, విల్లు, పాశం, నాగలి, గద, రోకలి, వజ్రం, శూలం - అనే ఎనిమిది ఆయుధాలు ఎడమవైపున ఉండే ఎనిమిది బాహువులలో ధరించిన, శ్రీభగవానుని తేజోగుణానికి అభిమాన పురుషుడైన శ్రీసుదర్శనుడు మీ సంపదకోసం విజృంభించాలి.

శ్రీసుదర్శనుడు మీకు గొప్ప తేజస్సును ఇవ్వాలి.

**81.** **పీతం కేశే రిపోరప్యసృజి రథపదే సంశ్రితే౽ప్యుత్కటాక్షం**
**చంద్రాధఃకారి యంత్రే వపుషి చ దలనే మండలే చ స్వరాజ్యమ్ ।**
**హస్తే వక్త్రే చ హేతిస్తబకిత మసమం లోచనే మోచనే చ**
**స్తా దస్తోకాయ ధామ్నే సురవరపరిషత్సేవితం దైవతం వః ॥**

తుల్యయోగితాలంకారప్రక్రియలో రచింపబడ్డ ఈ శ్లోకం పరమరమణీయం. సుదర్శనపురుషుని మూర్తి కేశాలలో పచ్చని బంగారు రంగును కల్గినది. (పీతం) శత్రువుల రక్తాన్ని పానం చేసినది(పీతం) ఉత్కటమైన, లోతైన అక్షాన్ని కల్గినది (ఉత్కటాక్షం). ఆశ్రితుల విషయంలో ఉద్భూతమైన కటాక్షాన్ని కల్గినది. (ఉత్కటాక్షం). చంద్రమండలాన్ని వ్రాసి, దానిపై సుదర్శనయంత్రాన్ని స్థాపించడంవల్ల సుదర్శనుని



రూపం (చంద్రాధఃకారి) చంద్రమండలాన్ని కింద కల్గినది. తన తేజస్సుతో చంద్రుని తిరస్కరిస్తున్నది. (చంద్రాధఃకారి). సుదర్శనమూర్తి శత్రుదళనంలో ఆ విజయాన్ని సూచించే సింహనాదాన్ని గుర్తుగా కల్గి ఉంటుంది. (సర్వాంకమ్) ప్రణవలాంఛితమై ఉంటుంది. (సర్వాంకమ్) ఆయుధవిశిష్టాలైన హస్తాలను కల్గి ఉంటుంది. (హేతిస్తబకితం) జ్వాలా పరివృతం అయిన ముఖాన్ని కల్గి ఉంటుంది. (హేతిస్తబకితం) సుదర్శనుని రూపం శస్త్రప్రయోగంలో సాటి లేనిది (అసమం) మూడు కన్నులను కల్గినది (అసమం) అదే రీతిలో శస్త్రప్రయోగంలో సాటిలేనిది. ఇటువంటి సుదర్శన పురుషుని మూర్తి మీకు అంతు లేని తేజస్సును ఇవ్వాలి.

శ్రీసుదర్శనుడు మీకు గొప్ప సంపదను ఇవ్వాలి.

**82.** **చిత్రాకారైః స్వచారైః మితసకలజగజ్జాగరూకప్రతాపః**
**మంత్రం తంత్రానురూపం మనసి కలయతో మానయ న్నాత్మగుహ్యాన్ ।**
**పంచాంగస్ఫూర్తినిర్వర్తితరిపువిజయో ధామ షణ్ణాం గుణానాం**
**లక్ష్మీం రాజాసనస్థో వితరతు భవతాం పూరుష శ్చక్రవర్తీ ॥**

శ్రీసుదర్శనమూర్తికి, చక్రవర్తికి- ఇద్దరికీ అద్భుతంగా అన్వయించే రీతిలో ఆరు విశేషణాలతో ఈ శ్లోకం రచింపబడింది.

శ్రీసుదర్శనుని సంచారాలు పేషణ- భస్మీకరణ- ఖండన- లుంఠన- కుట్టన- ప్రహరణాదులతో చిత్రవిచిత్రాలైన రీతులలో ఉంటాయి. సార్వభౌముడు కాపాలికాది పలు రూపాలను కల గూఢచారులద్వారా రాజ్యంలోని విషయాలను గ్రహిస్తాడు. సుదర్శనపురుషుడు ఎల్లప్పుడు వెలిగే ప్రతాపాన్ని కలవాడు. సార్వభౌముడుకూడా సదా తేజస్వి. సంహితాదులలో తెలుపబడ్డరీతిలో సుదర్శనమంత్రాన్ని గుహ్యంగా మనస్సులో ధ్యానించే భక్తులకు సుదర్శనుపురుషుడు అనుగ్రహిస్తాడు. రాజతంత్రానుసారంగా రహస్యంగా మంత్రాలోచనను చేసే అంతరంగసేవకుల విషయంలో చక్రవర్తి ప్రసన్నుడై గౌరవాన్ని కల్గి ఉంటాడు. సుదర్శనమూర్తి జ్వాల, నేమి, అరం, నాభి, అక్షం- అనే- అయిదు అవయవాల స్ఫురణలతో శత్రుసంహారాన్ని నిర్వహిస్తాడు. చక్రవర్తి, కర్మల ఆరంభోపాయం, పురుషద్రవ్యసంపత్తు, వినిపాత ప్రతీకారం, దేశకాలవిభాగం, కార్యసిద్ధి- అనే అయిదు అంగాల స్ఫూర్తిద్వారా శత్రువిజయాన్ని నిర్వహిస్తాడు. శ్రీసుదర్శనచక్రవర్తి, జ్ఞాన శక్తిబలైశ్వర్య వీర్యతేజస్సులనే ఆరు గుణాలను కలవాడు. సార్వభౌముడుకూడా సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధీభావ, సంశ్రయాలనే ఆరు గుణాలకు స్థానం. సుదర్శనచక్రవర్తి యంత్రంలో చంద్రాసనాన్ని అధిష్ఠించి ఉంటాడు. సార్వభౌముడు రాజసింహాసనాన్ని అధిష్ఠించి

ఉంటాడు. ఇటువంటి సార్వభౌమసదృశుడైన సుదర్శనచక్రవర్తి, మీకు సంపత్తును విశేషంగా ప్రదానం చేయాలి.

శ్రీసుదర్శనుడు మీకు మనోరథపూర్తిని కల్గించాలి.

**83.** **అక్షావృత్తాభ్రమాలాన్యరవివరలుఠచ్చంద్రచండద్యుతీని**
**జ్వాలాజాలావలీఢస్ఫుటదుడుపటలీపాణ్డుదిఙ్మండలాని ।**
**చక్రాంతాక్రాంతచక్రాచలచలితమహీచక్రవాలార్త శేషాణి**
**అస్త్రగ్రామాగ్రిమస్య ప్రదదతు భవతాం ప్రార్థితం ప్రస్థితాని ॥**

ఇందులో సుదర్శనుని గమనాలు వర్ణింపబడుతున్నాయి. మేఘసమూహాలు చక్రాక్షంలో సంచరిస్తాయట. చంద్రుడు, సూర్యుడు సుదర్శనుని అరాలమధ్య పరిభ్రమిస్తూ ఉంటారట. నక్షత్రరాసులు సుదర్శనుని జ్వాలాసమూహాలతో అభిభవింపబడి చెదటి దిగంతాల వరకు వ్యాపించి, అంతటా తెల్లగా చేస్తాయట. చక్రనేమి చక్రవాళపర్వతపర్యంతం వ్యాపించి ఆక్రమించడంవల్ల ఆ పర్వతం కుంచించుకొని పోగా, దానివల్ల భూమికూడా సంకోచాన్ని పొందినదట. అందుచేత తన వేయి పడగలతో భూమి బరువును మోసే ఆదిశేషుడు "నాకేమి మూడుతుందో! ఏమో!" అని భీతిల్లాడట. ఇటువంటి ప్రయాణాలను కల శ్రీసుదర్శనుడు మీకు కోరిన దానిని విశేషంగా ఇవ్వాలి.

శ్రీసుదర్శన పురుషుడు మీకు సుఖాన్ని కల్గించాలి.

**84.** **శూలం త్యక్తాత్మశీలం సృణి రణుకఘృణిః పట్టిసః స్పష్టసాదః**
**శక్తి శ్శాలీనశక్తిః కులిశ మకుశలం కుంఠధారః కుఠారః ।**
**దండ శ్చండత్వశూన్యో భవతి తను ధను ర్యత్పురస్తా త్స వః స్తాత్**
**గ్రస్తాశేషాస్త్రగర్వో రథచరణపతిః కర్మణే శార్మణాయ ॥**

ప్రసిద్ధాలైన ఆయుధాలన్నీ శ్రీసుదర్శనునిముందు నిర్వీర్యాలయ్యాయని ఇందులో తెలుపబడుతున్నది.

శ్రీసుదర్శనుని ముందు శూలం అనే ఆయుధం తన శత్రుసంహారసామర్థ్యాన్ని కోల్పోయింది. అంకుశం కాంతి తగ్గి వెలవెలపోయింది. పట్టాకత్తి చిక్కిపోయింది. వజ్రానికి కుశలం లేకుండా పోయింది. దండానికి గల ప్రచండత నశించింది. ధనుస్సు కృశించింది. శక్తి శక్తిహీనం అయింది. ఈ విధంగానే మిగిలిన ఆయుధాలన్నీ సుదర్శనముందు నిర్వీర్యాలయ్యాయి. ఇటువంటి సుదర్శనుడు మీకు సుఖాన్ని కల్గించాలి.



శ్రీసుదర్శనుడు మీకు స్థిరమైన ప్రశస్తిని కల్గించాలి.

**85.** **క్షుణ్ణాజానేయబృందం క్షుభితరథగణం సన్నసాన్నాహ్యయూథం**
**క్ష్వేళాసంరంభహేలాకలకలవిగళత్పూర్వగీర్వాణగర్వమ్ ।**
**కుర్వాణ స్సాంపరాయం రథచరణపతిః స్థేయసీం వః ప్రశస్తిం**
**దుగ్ధాం దుగ్ధాబ్ధిభాసం భయవివశశునాసీరనాసీరవర్తీ ॥**

శ్రీసుదర్శనుడు యుద్ధరంగంలో ప్రవేశించి రథగజతురగాదులను భగ్నం చేసి వీరవిహారం చేసిన తీరు ఇందులో తెలుపబడుతున్నది. అసురులవల్ల రాక్షసులవల్ల కల్గిన భీతిచేత ఇంద్రుడు వివశుడయ్యాడు. అపుడు సుదర్శనుడు యుద్ధరంగంలో ప్రవేశించి, ప్రత్యర్థుల సేనలోని కులీనాశ్వాల బృందాన్ని చూర్ణం చేశాడు. రథాల సమూహాన్ని శిథిలం చేశాడు. యుద్ధసన్నద్ధులైన పదాతి సేనలను చెల్లాచెదఱు చేశాడు. రథంతో రథాన్ని, గుఱ్ఱంతో గుఱ్ఱాన్ని, ఏనుగుతో ఏనుగును, పదాతులతో పదాతిసేనను వధించి, గొప్ప హేలాకలకలాన్ని చేశాడు. ఈవిధంగా అసురుల గర్వం అణగిపోయే గొప్ప యుద్ధాన్ని చేసిన చక్రరాజం మీకు పాలసముద్రంవలె తెల్లగా ప్రకాశించే, శాశ్వత మైన కీర్తిని మీకు ఇవ్వాలి.

శ్రీసుదర్శనుడు మిమ్ములను కీర్తిని కలవారినిగా చేయాలి.

**86.** **ద్రుహ్యద్దోశ్శాలిమాలిప్రహరణరభసోత్తానితే వైనతేయే**
**విద్రాతి ద్రాక్ ప్రయుక్తః ప్రథనభువి పరావర్తమానేన భర్త్రా ।**
**నిర్జిత్య ప్రత్యనీకం నిరవధికచరద్దాస్తికాశ్వీయరథ్యం**
**పథ్యం విశ్వస్య దాశ్వాన్ ప్రథయతు భవతో హేతి రింద్రానుజస్య ॥**

ఉత్తరరామాయణంలోని ఏడవసర్గలో గల మాలివృత్తాంతాన్ని పురస్కరించుకొని ఈ శ్లోకం రచింపబడింది.

లోకకంటకుడైన మాలి యుద్ధంలో తన ఆయుధంతో మోదిన దెబ్బలను తట్టుకోలేక గరుడుడు భయపడి వెనుదిరిగి పారిపోయాడు. అపుడు గరుడునిపై ఉన్న భగవానుడు సుదర్శనాన్ని మాలిపై ప్రయోగించి అతని కంఠాన్ని తుంచాడు. భగవానునిచే ప్రయోగింపబడ్డ సుదర్శనం యుద్ధంలో స్వైరంగా సంచరించే రథగజతురగపదాతిసైన్యాన్ని కల శత్రువర్గాన్ని పూర్తిగా నిర్జించి, లోకానికి హితాన్ని కలుగజేసింది. అటువంటి సుదర్శనం మిమ్ములను కీర్తిని కలవారినిగా చేయాలి.

శ్రీసుదర్శనుడు మీ కష్టాలను తీర్చాలి.

87. నందిన్యానందశూన్యే గలతి గణపతౌ వ్యాకులే బాహులేయే
చండే చాకిత్యకుంఠే ప్రమథపరిషది ప్రాప్తవత్యాం ప్రమాథమ్ ।
ఉచ్ఛిద్యాజౌ బలిష్ఠం బలిజభుజవనం యో దదా వాదిభిక్షోః
భిక్షాం తత్ప్రాణరూపాం స భవదకుశలం కృష్ణహేతిః క్షిణోతు ॥

భగవానుడు సుదర్శనాన్ని ప్రయోగించి బాణాసురుని వేయి బాహువులను తుంచిన వృత్తాంతాన్ని పురస్కరించుకొని ఈ శ్లోకం రచింపబడింది.

బాణాసురునితో జరిగిన యుద్ధంలో శివుని అనుచరుడైన నంది సుదర్శనంచేత పరాభవింపబడి ఆనందం లేనివాడయ్యాడు. వినాయకుడు వెనుకంజవేశాడు. కుమారస్వామికి ఏమీ తోచని రీతిలో వ్యాకులం కల్గింది. చండుడు భయంవల్ల స్తబ్ధుడయ్యాడు. ప్రమథగణాలన్నీ భంగాన్ని పొందాయి. ఈ స్థితిలో సుదర్శనుడు బాణాసురుని బలమైన బాహువనాన్ని ఖండించి, అతని ప్రాణరూపంలోని భిక్షను ఆదిభిక్షువు అయిన శివునకు ఇచ్చాడు. అంటే- బాణుని ప్రాణాలతో విడువుమన్న శివుని ప్రార్థనను అంగీకరించి అతనిని ప్రాణాలతో వదలిపెట్టాడు. అటువంటి సుదర్శనం మీ కష్టాలను తీర్చాలి.

శ్రీసుదర్శనుడు మీకు నిరపాయమైన సంపదను ఇవ్వాలి.

88. రక్తౌఘాభ్యక్తముక్తాఫలలులితలసత్వీచివృద్ధౌ మహాబ్ధౌ
సంధ్యాసంబద్ధతారాజలధరశబలాకాశనీకాశకాంతౌ ।
గంభీరారంభ మంభశ్చర మసురకులం వేదవిఘ్నం వినిఘ్నన్
నిర్విఘ్నం వః ప్రసూతాం వ్యపగతవిపదం సంపదం చక్రరాజః ॥

బ్రహ్మవద్ద ఉండే వేదాలను అపహరించి, సముద్రంలో దాగిన అసురకులాన్ని సుదర్శనం వధించిన వృత్తాంతం ఇందులో ప్రస్తుతం. (సముద్రంలో దాగిన అసురులను వధించడంకోసం) భగవానునిచే ప్రయోగింపబడ్డ శ్రీసుదర్శనం సముద్రమధ్యంలో ప్రవేశించి అసురులను సంహరించేటపుడు ఆ అసురుల శరీరాలనుండి బయటకు స్రవించిన రక్తధారలు సముద్రంలో ఉండే ముత్యాలతో కలవడంవల్ల, ఆ ముత్యాలు ఎఱ్ఱగా అయినవి. ఆ ముత్యాలతో కూడిన సముద్రం తరంగాలతో అభివృద్ధి చెందుతున్నది. ఎఱ్ఱని ముత్యాలతో కూడిన భాగం కొంత, అలలు లేచే నల్లని భాగం కొంత-ఈ రెండింటిని కల సముద్రాన్ని చూస్తే, సంధ్యారాగరంజితాలైన నక్షత్రాలతో, కాలమేఘాలతో కూడి ఉండే ఆకాశంవలె శబల (కర్బుర) వర్ణంతో ఉన్నది. ఈ విధంగా వేదాపహారకులైన అసురులను వధించిన సుదర్శనుడు మీకు ఏ ఆపదలు లేని సంపదను నిర్విఘ్నంగా ప్రసాదించాలి.



శ్రీసుదర్శనుడు లోకాలు మెచ్చే సంపదను మీకు ఇవ్వాలి.

89. కాశీవిప్లోషచైద్యక్షపణధరణిజధ్వంససూర్యాపిధాన-
గ్రాహద్వేధాత్వమాలిత్రుటనముఖకథా వస్తుసత్కీర్తిగాథాః ।
గీయంతే కిన్నరీభిః కనకగిరిగుహాగేహినీభి ర్యదీయాః
దేయాత్ దైతేయవైరీ స సకలభువనశ్లాఘనీయాం శ్రియం వః ॥

ఈ శ్లోకంలో శ్రీసుదర్శనునివైభవఖ్యాపకాలైన పలు పౌరాణిక- ఐతిహాసిక వృత్తాంతాలు ప్రస్తావింపబడ్డాయి. కాశీదహనవృత్తాంతం, నరకాసురసంహారం, శిశుపాలవధ, సూర్యుని ఆచ్ఛాదించడం, మొసలిని ఖండించిన కథ - ఇవన్నీ పౌరాణికాలు. మాలికథ శ్రీరామాయణోక్తం. సుదర్శనవైభవాన్ని తెలిపే ఈ చరిత్రలను మేరుపర్వతగుహల్లో నివసించే కిన్నరస్త్రీలు గానం చేస్తున్నారు. ఇటువంటి సుదర్శనపురుషుడు మీకు సకల లోకాలు ప్రశంసించే ఉత్తమమైన సంపదను ఇవ్వాలి.

శ్రీసుదర్శనుడు మీ అజ్ఞానాన్ని ఖండించాలి.

90. నానావర్ణాన్ వివృణ్వాన్ విరచితభువనానుగ్రహాన్ విగ్రహా న్యః
చక్రేష్వష్టాసు మృష్టాసురవరతరుణీకంఠకస్తూరికేషు ।
ఆతారా ద్వర్ణమాలావధిషు వసతి యః పూరుషో వ స్స దేయాత్
వ్యధ్యై రుద్ధూతసత్త్వైః ఉపహిత మబహిర్వ్యాప్త మధ్వాంతవర్తీ ॥

అహిర్బుధ్న్యసంహితలో తెలుపబడ్డ ఎనిమిది చక్రాలలో సుదర్శనపురుషుడు వేంచేసి ఉండే క్రమం ఇక్కడ ప్రస్తుతం. మొదటి చక్రం ప్రణవచక్రం, చివరిది ఎనిమిదవ చక్రం మాతృకాచక్రం. ఈ ఎనిమిది చక్రాలు అసురులను వధించి, వారి పత్నులను విధవలుగా చేస్తాయి. ఈ ఎనిమిది చక్రాలలో లోకానుగ్రహార్థం నీలపీతాదివర్ణాలను కల రూపాలలో సుదర్శనుడు వేంచేసి ఉంటాడు. బ్రహ్మ,విష్ణు, నారాయణ, వాసుదేవ, అసిత, నారసింహ, సుదర్శన, మాతృకలని ఈ ఎనిమిది చక్రాల పేర్లు. ఈ ఎనిమిది చక్రాలలో వేంచేసి ఉండే సుదర్శనుడు సాత్త్వికుల మనస్సులను అధిష్ఠించి ఉంటాడు. ఇతడు సత్త్వగుణం ఏ మాత్రం లేని దుష్టమార్గాలలో ప్రవర్తించడంవల్ల ఏర్పడే అజ్ఞానం మీకు కలుగకుండా ఉండేటట్లు చేయాలి.

శ్రీసుదర్శనపురుషుడు మిమ్ములను రక్షించాలి.

91. ద్వాత్రింశత్షోడశాష్టప్రభృతిపృథుభుజస్ఫూర్తిభి ర్మూర్తిభేదైః
కాలాద్యే చక్రషట్కే ప్రకటితవిభవః పంచకృత్యానురూపమ్ ।
అర్థానా మర్థితానామహరహ రఖిలం నిర్విలంబై ర్విలంబైః
కుర్వాణో భక్తవర్గం కుశలిన మవతా దాయుధగ్రామణీ ర్వః ॥

అహిర్బుధ్న్యసంహితలో తెలుపబడ్డ, ఆఱు చక్రాలలో వేంచేసి ఉండే సుదర్శన మూర్తి ప్రకారం ఇక్కడ ప్రస్తుతింపబడింది. ఆఱు చక్రాలలో సృష్టిస్థితి సంహార నిగ్రహానుగ్రహాలనే అయిదు వ్యాపారాలకు తగిన ముప్పై రెండు, పదహారు, ఎనిమది మొదలైన సంఖ్యలలో, పెద్ద పెద్ద భుజాలతో కూడిన రూపవిశేషాలను కల్గి ఉండి సుదర్శనుడు తన వైభవాన్ని ప్రకటిస్తున్నాడు. ఇతడు భక్తులు కోరిన అర్థాలను అన్నిటిని వేగంగా అనుగ్రహిస్తూ, ప్రతిదినం వారికి క్షేమాన్ని కల్గిస్తాడు. అటువంటి భగవానుని ఆయుధాలలో ప్రధానుడైన సుదర్శనుడు మిమ్ములను రక్షించాలి.

శ్రీసుదర్శన యంత్రపురుషుడు మీకు తన సాక్షాత్కారాన్ని కలిగించాలి.

92. కోణై ర్వర్ణై స్సరోజై రపి కపిశగుణై ష్షడ్భి రుద్భిన్నశోభే
శ్రీవాణీపూర్వికాభిః దధతి విలసతః శక్తిభిః కేశవాదీన్ ।
తారాంతే భూపురాదౌ రథచరణగదాశార్ఙ్గఖడ్గాంకితాశే
యంత్రే తంత్రోదితే వః స్ఫురతు కృతపదం లక్ష్మ లక్ష్మీసఖస్య ॥

అహిర్బుధ్న్యసంహితాదులలో తెలుపబడ్డ సుదర్శనయంత్రప్రకారం ఇందులో వర్ణింపబడుతున్నది. ఈ వర్ణన "గాయత్ర్యర్ణారచక్రే" అనే (96) శ్లోకంవరకు చేయబడుతున్నది. ఈ శ్లోకంలోని వివరాలు అత్యంతరహస్యాలు, ఆచార్యులద్వారా గ్రహించదగినవి.

షట్కోణాలను, షడరాలను, షట్పద్మాలను కల్గినది. శ్రీసుదర్శనయంత్రం. ఆ యంత్రం మధ్యలో ఉండే సుదర్శనపురుషుడు రక్తవర్ణుడు, రక్తాంబరుడు, రక్తకేశుడు, రక్తలోచనుడును. కనుక కోణ-అర్ణ- సరోజాలన్నీ కపిశవర్ణాన్ని కల్గి ఉంటాయి. శ్రీ,వాణి, వాక్, మృడానులనే నాల్గు శక్తులతో వెలిగే కేశవాది ద్వాదశమూర్తులను తూర్పుమొదలైన నాల్గు దిక్కులలో ఈ యంత్రం ధరిస్తున్నది. వరుసగా ముగ్గురు ముగ్గురుగా విభాగింప బడ్డ శ్రీవాణ్యాదిశక్తులు నల్గురితో కలిసిన కేశవాదిద్వాదశమూర్తులను యంత్రం ధరించి ఉంటుంది. శ్రీసుదర్శనయంత్ర సాధకులు మొదట భూబింబాన్ని ధ్యానించి, క్రమంగా చివరలో సుదర్శనగర్భప్రణవంతో సిద్ధిని పొందుతారు. ఈ క్రమం "తారాంతే భూపురాదౌ" - ఇత్యాదిగా సూచింపబడింది. యంత్రంలో తూర్పు మొదలైన నాల్గు దిక్కులలో క్రమంగా చక్రం, గద, శార్ఙ్గం, ఖడ్గం - అనే నాల్గు ఆయుధాలను విన్యాసం చేయాలి- అని సంహితాదులలో తెలుపబడింది. ఇటువంటి యంత్రంలో వేంచేసి ఉండే సుదర్శనుని రూపం మీ మనస్సులో ఆవిర్భవించాలి.



శ్రీసుదర్శనుడు మీ అనారోగ్యాన్ని తీర్చాలి.

93. దంష్ట్రాకాన్త్యా కడారే కపటకిటితనోః కైటభారే రధస్తాత్
ఊర్ధ్వం హాసేన విద్ధే నరహరివపుషో మండలే వాసవీయే ।
ప్రాక్ప్రత్యక్సాంధ్యసాంద్రచ్ఛవిభరభరితే వ్యోమ్ని విద్యోతమానః
దైతేయోత్పాతశంసీ రవి రివ రహయ త్వష్ట్రరాజో రుజం వః ॥

అహిర్బుధ్న్యసంహితలో తెలుపబడ్డ మహేంద్రమండలమనే ఒక యంత్ర సన్నివేశాన్ని తెలిపే శ్లోకం ఇది. "వరాహరూపిణం దేవం శంఖచక్రధరం వరమ్, భూమౌ చ సహితం భూమ్యా సంస్మరేత్ పురుషోత్తమమ్, అంబరే నారసింహం తు చింతయే దమితౌజసమ్" అంటూ యంత్రంలోని కిందిభాగంలో శ్రీవరాహమూర్తిని, పైభాగంలో నృసింహమూర్తిని ధ్యానించాలని విధించబడడాన్నిబట్టి ప్రస్తుతశ్లోకం రచింపబడింది.

కింద ఉండే శ్రీవరాహమూర్తి దంతకాంతి, పైన వేంచేసి ఉండే నరసింహమూర్తి హాసకాంతి కలిసి కడారవర్ణుడుగా శ్రీసుదర్శనుడు మాఱడాన్ని చూస్తే దైత్యుల వినాశాన్ని సూచించే అశుభశకునం అయిన, పూర్వాపరసంధ్యల నిబిడమైన అరుణవర్ణంతో కూడిన ఉత్పాతసూర్యుని స్థితి స్మరింపజేస్తున్నది. (వరాహదంష్ట్రా కాంతి, నృసింహమూర్తి, హాసకాంతి సహజంగా తెల్లనివి అయినా, హిరణ్యకశిపు, హిరణ్యాక్షుల వధ సందర్భాలలో అవి ఆయా అసురుల రక్తవర్ణం సోకి ఉపాధివశం చేత ఎఱ్ఱగా అయ్యాయి)ఇటువంటి సుదర్శనుడు మీకు కలిగే అనారోగ్యాన్ని తీర్చాలి.

శ్రీసుదర్శనుడు శత్రువిజయాన్ని మీకు కల్గించాలి.

94. కోణే క్వాపి స్థితోఽపి త్రిభువనవితతః చంద్రధామాఽపి రూక్షః
రుక్మచ్ఛాయోఽపి కృష్ణాకృతి రనలమయోఽప్యాశ్రితత్రాణకారీ ।
ధారాసారోఽపి దీప్తో దినకరరుచిరోఽప్యుల్లసత్తారకశ్రీః
చక్రేశ శ్చిత్రభూమా వితరతు విమతత్రాసనం శాసనం వః ॥

విరోధాభాసాలంకార ప్రక్రియలో ఈ శ్లోకం రచింపబడింది. ఎక్కడో ఒక మూలలో ఉన్నవాడైనా లోకం అంతా వ్యాపించాడు అనడం అర్థంలో విరోధం. రూపం ద్వారా ఒకచోట ఉన్నా, స్వరూపంతో సర్వత్ర వ్యాపించి ఉన్నాడు అనడంవల్ల ఆవిరోధం

తీరుతుంది. చంద్రుని కాంతిని కలవాడైనా తీక్షణమైనవాడన్నది ఇంకొక విరోధం. చంద్రమడలంలో సుదర్శనపురుషుడు అధివసించి శత్రుభీకరుడై ఉంటాడనే అర్థాంతరంవల్ల ఆ విరోధం తీరింది. బంగారు రంగువంటి రంగును కలవాడయినా నల్లని రంగును కలవాడని అనడం మఱి ఒక విరోధం. బంగారు రంగులో ప్రకాశించే వర్ణాన్ని కలవాడై, శ్రీకృష్ణుని ఆకృతిని ధరించినవాడనే అర్థాన్ని చెప్పడంవల్ల ఆ విరోధం తీరింది. తనకు ఆశ్రయాన్ని ఇచ్చేవానిని దహించేవాడు కావడంవల్ల "ఆశ్రయాశి" అనబడే అగ్నిరూపుడైనా, ఆశ్రితులను రక్షించేవాడు అని అనడం ఇంకొక విరోధం. అగ్నితేజస్సువంటి తేజస్సును కలవాడై, తన భక్తులను రక్షించేవాడని అనడంద్వారా ఆ అర్థం తీరింది. నీటిధారలను నిరంతరం కురిపించేవాడు దీప్తిని కల్గి ఉండడం ఇంకొక అర్థవిరోధం. అంచుల్లో పదును కలవాడు, సేనాముఖంలో బలిష్ఠుడు, గొప్పగా వెలిగేవాడని అర్థం చెప్పడంవల్ల ఆ విరోధం తొలగింది. సూర్యప్రకాశుడైన ప్రకాశించే తారకల కాంతిని కలవాడని అనడం విరుద్ధం. సూర్యాత్మకుడు, ప్రకాశించే ప్రణవకాంతిని కలవాడు అని అనడంద్వారా విరోధం తొలగింది. (ఈ వివరణ అంతా శ్లేషాలంకారమూలకం) ఇటువంటి ఆశ్చర్యకరం అయిన మహిమను కల సుదర్శనుడు మీ శత్రువులకు భయాన్ని కల్గించే రీతిలో శాసించాలి.

శ్రీసుదర్శనుడు మీ సోమఱితనాన్ని పోగొట్టాలి.

**95.** **శుక్ల శ్శక్ర స్తవ స్తే సహ దహన కలాం కాల తేఽయం న కాలః**
**కిం వో రక్షాంసి రక్షా తవ ఫలతు పతే యాదసాం పాదసేవా ।**
**వాయో హృద్యోఽసి భర్తుః త్యజ ధనద మదం సేవ్యతాం త్ర్యంబకేతి**
**ప్రాహుః యత్ యంత్రపాలాః స దనుజవిజయీ హంతు తంద్రాలుతాం వః ॥**

శ్రీసుదర్శనుని సేవించడానికి వచ్చిన ఇంద్రాది అష్టదిక్పాలకులను చూచి సుదర్శనయంత్రపాలకులు పలికే తీరు ఇందులో తెలుపబడింది. దేవేంద్రుణ్ణి చూచి "దేవేంద్రా ! నీవు చేసే స్తుతి బాగున్నది'' అని, అగ్నిని చూచి- 'అగ్నీ ! కొంచెం ఓపికపట్టు'' అని, యమునితో "యమా ! నీకిపుడు సమయం కాదు, మళ్ళీ రా'' అని, నిఋతి రాక్షసులను చూచి- "మీరు ఉజ్జీవించే ఉపాయం ఇక ఉన్నదా ?''అని, వరుణునితో - "నీవు చిరకాలంగా చేసే శ్రీసుదర్శన పాదసేవ ఫలించాలి''అని, వాయువుతో- ఓ వాయూ ! నీవు సుదర్శనునకు సంతోషాన్ని కల్గిస్తున్నావులే'' అని, కుబేరునితో "ధనదా ! నేనే ధనవంతుణ్ణి అనే గర్వాన్ని విడిచిపెట్టు'' అని, శివునితో "సుదర్శనుని సేవించు'' అని యంత్రపాలకులు అంటున్నారు. ఇటువంటి వైభవాన్ని కల శ్రీసుదర్శనుడు మీ సోమరితనాన్ని పోగొట్టాలి.



శ్రీసుదర్శనుడు మీ శోకాన్ని తీర్చాలి.

**96.** **గాయత్ర్యర్ణారచక్రే ప్రథమ మనుసఖస్మేరపత్రారవిందే**
**బింబం వహ్నేః త్రికోణం వహతి జయజయాద్యష్టశక్త్యా నిషణ్ణా ।**
**శోకం వోఽశోకమూలే పదసవిధలసద్భీమభీమాక్షభీమా**
**పుంసో దివ్యాస్త్రధామా పురుషహరిమయీ మూర్తి రస్యత్వపూర్వా ॥**

అహిర్బుధ్న్యసంహితలో 26వ అధ్యాయంలో విస్తృతంగా తెలుపబడ్డ పలు అంశాలు ఇక్కడ ఇందులో ప్రస్తుతింపబడుతున్నాయి.

ద్వాదశాక్షరీమంత్రంలోని అంకెల సంఖ్యతో సమ సంఖ్యను కల పన్నెండు దళాలను కల కమలాన్ని కల్గినది, అగ్నియొక్క త్రికోణరూపమైన బింబాన్ని కల్గినది, జయాన్ని కల్గించే జయాది అష్టశక్తులను కల్గినది, గాయత్రీమంత్రంలోని వర్ణాల సంఖ్య అయిన ఇరవై నాల్గు సంఖ్యలో అరాలను కల చక్రంలో అశోకవృక్షమూలదేశంలో కూర్చుని ఉన్నది, తన పాదసమీపంలో భయాన్ని కల్గించే నేత్రాలను కల, భీమాక్షులనే పేరును కల ఇద్దఱిని కల్గినది, అందువల్లనే భయాన్ని కల్గించేది అయిన శ్రీసుదర్శనపురుషుని నృసింహమయం అయిన, విలక్షణం అయిన మూర్తి మీ దుఃఖాన్ని పోగొట్టాలి. (ప్రథమ మనువు అంటే వాసుదేవద్వాదశాక్షరి. ప్రథమవ్యూహం అయిన వాసుదేవుని ప్రతిపాదించడంవల్ల అది మొదటి మనువు అయింది.)

గాయత్రీ మంత్రసంఖ్యలో ఇరవై నాల్గు అరాలను కల చక్రం లిఖించి, అందులో పన్నెండు దళాలను కల పద్మాన్ని వ్రాసి, ఆ పన్నెండు దళాలలో వాసుదేవద్వాదశాక్షరిని వ్రాసి, ఆ పద్మం కర్ణికాస్థానంలో త్రికోణరూపమైన ఆగ్నేయమండలాన్ని లిఖించి, అందులో అశోకవృక్షాన్ని వ్రాయాలి. దాని మూలంలో కూర్చుని ఉన్నవాడు, నాల్గు చక్రాలను కల నాల్గు బాహువులను కలవాడు, యోగ షట్కపరివేష్ఠితమైన దివ్యాంగాన్ని కలవాడు, కాలానలవర్ణసదృశవర్ణాన్ని కలవాడు అయిన నృసింహుని నిలిపి, ఆ మూర్తి పాదసమీపంలో భయంకరరూపులు, భీమాక్షులనే పేరును కలవారిని ఇద్దఱిని వ్రాసి, చక్రం తూర్పు మొదలైన దిక్కులలో వరుసగా, జయ, మోహిని, విజయ, హ్లాదిని, అజిత, మాయ, అపరాజిత, నిధి- అనే ఎనిమిది మంది శక్తులను నిలపాలి. ఇది క్లుప్తంగా సుదర్శననారసింహయంత్రోద్ధారక్రమం. అహిర్బుధ్న్యసంహితాప్రోక్తం.

శ్రీసుదర్శన పురుషుడు మీకు ఉత్తమ యశస్సును కల్గించాలి.

**97.** **పాశ్చాత్యాశోకపుష్పప్రకరనిపతితైః ప్రాప్తరాగం పరాగైః**
**సంధ్యారోచిస్సగంధైః స్వపదశశధరం ప్రేక్ష్య తారానుషక్తమ్ ।**
**పద్మా నాబద్ధకోశా నివ సురనివహై రంజలీన్ కల్ప్యమానాన్**
**చక్రాధీశోఽభినందన్ ప్రదిశతు సదృశీ ముత్తమశ్లోకతాం వః ॥**

యంత్రంలో వెనుకవైపున ఉండే అశోకవృక్షంయొక్క పుష్పాలను సమూహం నుండి కిందపడ్డ, సంధ్యాకాలవర్ణంవంటి ఎఱ్ఱని వర్ణాన్ని కల, పుష్పొడిచేత ఎఱ్ఱగా అయిందా! అనేటట్లుండేది, ప్రణవసంబంధాన్ని కల్గినది, స్వస్థానం అయిన చంద్ర మండలాన్ని చూచి దేవతల కరకమలాలు ముకుళిస్తున్నవా ? అని అన్నట్లుగా వారు తమ చేతులను జోడించి శ్రీసుదర్శనునకు అంజలిని చేస్తున్నారు. ఆ అంజలులను శ్రీసుదర్శనమూర్తి సానందంగా పరిగ్రహిస్తున్నాడు. అటువంటి సుదర్శనుడు మీకు తనకు తగిన గొప్ప కీర్తిని అనుగ్రహించాలి. (శ్లోకంలో "తారానుషక్తమ్", "ప్రేక్ష్య ఆబద్ధకోశాన్" ఇత్యాది పదప్రయోగాల స్వారస్యాన్నిబట్టి, తారాశశాంకవృత్తాంతం స్మారితం- అని వ్యాఖ్య)

శ్రీసుదర్శన నారసింహమూర్తి మీ సాంసారిక తాపాన్ని తీర్చాలి.

98. రక్తాశోకస్య వేదస్య చ నిహితపదం ప్రాప్తశాఖస్య మూలే
చక్రై రష్టై ష్టదాద్యై రపి మహితచతుర్భిశ్చతుర్బాహుదండమ్ ।
ఆసీనం భాసమానం స్థిత మపి భయత స్త్రాయతాం తత్త్వ మేకం
పశ్చాత్ పూర్వత్ర భాగే స్ఫుటతరహరితామానుషం జానుషా ద్వః ॥

ఇది శ్రీసుదర్శననారసింహమూర్తి ధ్యానశ్లోకం శ్రీసుదర్శనచక్రంలో ముందు భాగంలో శ్రీసుదర్శనపురుషుడు నిలుచున్న సన్నివేశంలో చక్రాది ఎనిమిది ఆయుధాలను ఎనిమిది బాహువులలో ధరించి ఉండి దర్శనమిస్తాడు. వెనుక భాగంలో పలు శాఖలను కల అశోకవృక్షం మూలంలో, ప్రణవాంకితమైన స్థానంలో, కూర్చున్న సన్నివేశంలో వేంచేసి ఉండే నారసింహమూర్తి నాల్గు బాహువులలో నాల్గు చక్రాలను ధరించి సేవను అనుగ్రహిస్తాడు. ఇటువంటి రెండు తత్త్వాలు ఏకమై ఉండే అద్వితీయమైన శ్రీసుదర్శననారసింహరూపం మీ సాంసారికభయాన్ని తీర్చాలి.

శ్రీసుదర్శన మూర్తి మీకు తన సాక్షాత్కారాన్ని కల్గించాలి.

99. ప్రాణే దత్తప్రయాణే ముషితదిశి దృశి త్యక్తసారే శరీరే
మత్యాం వ్యామోహవత్యాం సతమసి మనసి వ్యాహతే వ్యాహృతే చ ।
చక్రాంతర్వర్తి మృత్యుప్రతిభయ ముభయకారచిత్రం పవిత్రం
తేజ స్త త్తిష్ఠతాం వః త్రిదశకులధనం త్రీక్షణం తీక్ష్ణదంష్ట్రమ్ ॥

ప్రాణాలు అంతిమయాత్రకు సిద్ధపడి బయలుదేరగా, కళ్ళు చూపును కోల్పోయి, మనస్సులో చీకటి నిండి, మాట తడబడిన సమయంలో మృత్యుభయంకరమైనది, నర-సింహరూపాల పరిగ్రహణంవల్ల అత్యాశ్చర్యకరం అయినది, పరమపవిత్రం, దేవతలకు ఆపద్ధనం, త్రిణేత్రం, తీక్ష్ణదంష్ట్రం శ్రీసుదర్శనచక్రాంతర్వర్తి అయిన దివ్యతేజస్సు మీకు తన స్వరూపాన్ని ఆవిర్భవింపజేయాలి ! అంతిమయాత్రలో మీకు కలిగే భీతిని తీర్చుగాక !



శ్రీసుదర్శనమూర్తి మీకు సకలార్థప్రదుడు కావాలి.

100. యస్మిన్ విన్యస్య భారం విజయిని జగతాం జంగమస్థావరాణాం
లక్ష్మీనారాయణాఖ్యం మిథున మనుభవత్యత్యుదారాన్ విహారాన్ ।
ఆరోగ్యం భూతి మాయుః కృత మిహ బహునా యద్యదాస్థాపదం వః
తత్తత్ సద్య స్సమస్తం దిశతు స పురుషో దివ్యహేత్యక్షవర్తీ ॥

చరాచరాత్మకమైన సకలజగత్తుయొక్క నిర్వహణభారాన్ని లక్ష్మీనారాయణ దంపతులు శ్రీసుదర్శనమూర్తికి అప్పగించి, తాము నిర్విచారంగా "నిర్భరో నిర్భయోఽస్మి" అన్నట్లు ఆనందంగా విహరిస్తూ ఆనందిస్తున్నారు. అటువంటి సుదర్శన చక్రాంతర్వర్తి అయిన మూర్తి మీకు పూర్తి ఆరోగ్యాన్ని, సంపదను, ఆయుస్సును, ఇంకా ఇంకా మీరు కోరేవాటిని అన్నిటినీ వెంటనే నిండుగా అనుగ్రహించాలి.

## ఫలశ్రుతి

101. పద్యానాం తత్త్వవిద్యాద్యుమణిగిరిశవీథ్యంగసంఖ్యాధరాణాం
అర్చిష్యంగేషు నేమ్యాదిషు చ పర మతః పుంసి షడ్వింశతే శ్చ ।
సంఘైః సౌదర్శనం యః పఠతి కృత మిదం కూరనారాయణేన
స్తోత్రం నిర్విష్టభోగో భజతి స పరమాం చక్రసాయుజ్యలక్ష్మీమ్ ॥

ఇతి శ్రీమత్ కూరనారాయణయతీంద్రవిరచితం
శ్రీసుదర్శనశతకం సమాప్తమ్

స్తోత్రం చివరలో ఫలశ్రుతిని తెలిపే శ్లోకం ఇది.

జ్వాలావర్ణన ఇరవై నాల్గు శ్లోకాలతో, నేమివర్ణన పద్నాలుగు శ్లోకాలతో, అరాల వర్ణన పన్నెండు శ్లోకాలతో, నాభివర్ణన పదకొండు శ్లోకాలతో, అక్షవర్ణన పదమూడు శ్లోకాలతో, శ్రీసుదర్శనపురుషుని వర్ణన ఇవరై ఆఱుశ్లోకాలతో చేయబడ్డ ఈ శ్రీసుదర్శన భగవానుని స్తోత్రాన్ని అనుసంధానం చేసేవాడు ఈ లోకంలో అన్ని భోగాలను పూర్తిగా అనుభవించి, తరువాత దేహావసానంలో శ్రీసుదర్శనపురుషునివలె భగవానునకు ఇష్టవినియోగార్హుడు కాగలడు.

Printed at TTD Press, Tirupati. C.2,000-Free Booklet-2011-(VKS)